# పిల్లల తెలివితేటలు

[టాల్‌స్టాయ్]



అనువాదం :

రెంటాల గోపాలకృష్ణ




ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.

# ఇందులో

# మతం

[ఒక బాలుడు - అతని తల్లి]

బాలుడు: అమ్మా! ఇవాళ పరిచారిక మంచి దుస్తులు కట్టుకుంది. నాకు కూడా ఈ కొత్త చొక్కా తొడిగింది. విశేషం ఏమిటమ్మా?

తల్లి: ఎందుకంటే, ఇవాళ పండగ నాయనా! ఇవాళ మనమంతా చర్చికి వెళుతున్నాం.

బాలుడు: ఏమి టా పండగ?

తల్లి: అసషన్ డే. [హోలీ థర్స్‌డే]

బాలుడు: అంటే ఏమిటమ్మా?

తల్లి: అంటే ఇవాల్టిరోజున క్రీస్తు ప్రభువు స్వర్గానికి వెళ్ళాడు నాయనా.

బాలుడు: స్వర్గానికి వెళ్ళడమంటే?

తల్లి: అనగా పైకి వెళ్ళడన్నమాట.

బాలుడు: పైకి ఎలాపోయాడు? రెక్కలతోనా?

తల్లి: రెక్కలతో కాదు బాబూ. ఊరకనే పైకి వెళ్ళిపోయాడు. ఆయన దేవుడు. దేవుడు ఏపని అయినా చేయగలడు.

బాలుడు: అయితే ఆయన ఎక్కడికి వెళ్ళాడంటావ్? ఆకాశానికి అంతు లేదట—నాన్నగారు నాతో చెప్పారు. ఆకాశంలో నక్షత్రాలు తప్ప మరేమీ లేవు. ఆ నక్షత్రాల తరువాత ఇంకా ఇంకా నక్షత్రాలు వుంటాయట. అలా ఆకాశం అంతులేకుండా ఉంటుందట. మరి ఆయన పైకి ఎగిరిపోతే, ఎక్కడికి వెళ్ళినట్లు?

తల్లి: (నవ్వుతూ) ఇలాంటి విషయాలన్నీ మనకు అర్థంకావు నాయనా. నమ్మకం వుండాలి. అంతే.

బాలుడు: అంటే దేనిమీద నమ్మకం వుండాలి?

తల్లి: పెద్దవాళ్లు చెప్పేమాటమీద

బాలుడు: అయితే అమ్మా! అప్పుడో కాయన నాతో, మనిషిలో లవణాలు వుంటాయనీ, ఆ లవణాలు విడిపోగానే మనిషి చచ్చిపోతాడనీ చెప్పారు. ఆ మాట నీతో అన్నాను. ఇలాంటి పిచ్చి పిచ్చి మాటలు నమ్మవద్దని గదిమావు. ఎందుకమ్మా మరి ?

తల్లి: అవును బాబూ. అది నిజమే. అర్థంలేనిమాటలు ఏవీ కూడా నమ్మకూడదు.

బాలుడు: అయితే ఏవి అర్థంలేని మాటలో, ఏవి నిజమైన మాటలో, నే నెలా తెలుసుకోవడం?

తల్లి: నీవు నిజమైన నమ్మకాన్నే కలిగివుండాలి.

బాలుడు: అది సరేనమ్మా. నిజమైన నమ్మకం అంటే ఏది? అది ఎక్కడుంది?

తల్లి: మనం నమ్మేదేన్నది. మన విశ్వాసమే నిజమైన విశ్వాసం. [తనలో] నే నేమిటి ఇలా మాట్లాడుతున్నాను? నేను మాట్లాడేదానికి అర్థం వుందా? [పైకి] సరే బాబూ! ఇహ నీవువెళ్ళి మీ నాన్నగారితో చర్చికి వెళుతున్నామని చెప్పు. నీ శాలువ కప్పుకుని రా.

బాలుడు: అక్కడ పూజ అయిపోయిన తరువాత మనకు చాక్‌లెట్లు పెడతారుకదూ?

# యుద్ధం

కారల్ చెన్. 9 ఏండ్ల బాలుడు
పెట్యాజిర్లావ్, 10 ఏండ్ల బాలుడు
మాషా జిర్లావా. 8 ఏండ్ల బాలిక

కారల్ చెన్: ఇహమీదట మా భూమిని రష్యనులు ఆక్రమించుకుంటే మా ప్రష్యా ఊరుకోదు!

పెట్యా: కాని ఒకవిషయం. ఆభూమి మాదే. మొదట మేమే దాన్ని జయించాం కనుక, అది మాకే చెందుతుంది.

మాషా: మేము అంటున్నావు. ఆ 'మేము' అంటే ఎవరు?

పెట్యా: నీవు ఇంకా పసిపిల్లవు. నీవు ఏం అర్థంచేసుకోగలవు? 'మేము' అంటే మన దేశంలోవున్న ప్రజలు.

కారల్ చెన్: అలాంటప్పుడు ప్రతిచోటా అంతే. కొందరు మనుషులు ఒక దేశానికి చెందినవాళ్ళు, ఇంకా కొందరు మరొక దేశానికి చెందినవాళ్ళు.

మాషా: అయితే నేను ఏదేశానికి చెందినదాన్ని?

పెట్యా: మా అందరికిమల్లే నీవూ రష్యాకు చెందినదానివి.

మాషా: నేనలా అక్కర్లేదంటాను. అప్పుడూ?

పెట్యా: నీవు కావాలనుకుంటే రాదు, పోవాలనుకుంటేపోదు. నీ ఇష్టంలో ఏమీలేదు. ఎలాఅనుకున్నా నీవు రష్యనువే. ప్రతిదేశంలో ఒక చక్రవర్తిగాని, లేక రాజుగాని వుంటాడు.

కారల్ చెన్: [మధ్యలో అందుకొని] లేకపోతే పార్లి మెంటు.........

పెట్యా: ప్రతి ప్రభుత్వానికీ తన స్వంత సైన్యం వుంటుంది. తన ప్రజలనుండి పన్నులు వసూలుచేస్తుంది.

మాషా: అయితే మరి, అవన్నీ ఎందుకలా వేరువేరు అయిపోయాయి?

పెట్యా: వేరువేరు అయిపోవడమేమిటి? నీవు అడిగేదానికి అర్థంలేదు. అసలు ఒకదేశానికీ మరోదేశానికీ సంబంధం లేదు. ఏ దేశానికి ఆదేశమే ప్రత్యేకంగా వుంటుంది.

కారల్ చెన్: నేను చెప్తాను విను: ప్రతి మనిషీ తన జన్మభూమిని ప్రేమిస్తాడు కనుక అలా ప్రత్యేకమైపోయాయి.

మాషా: ఏమో! నాకర్థంకావడంలేదు. దేశాలన్నీ విడిపోకుండా కలిసికట్టుగావున్నట్లయితే ఎంతో బాగుండదూ?

పెట్యా: అందరం కలిస్తే ఆటలాడుకోవడానికి బాగుంటుంది. కాని ఇది ఆటకాదు. అతి ముఖ్యమైన విషయం.

మాషా: ఏమో! నీవు చెప్పేది నాకు తెలియడంలేదు.

కారల్ చెన్: తెలుస్తుంది. నీవు బాగా పెరిగి పెద్దదానివి అయింతరువాత ఈ సంగతి అంతా అర్థమవుతుంది.

మాషా: ఊహుం, అయితే నేను పెరగను, పెద్దదాన్నికాను. అప్పుడో?

పెట్యా: అబ్బబ్బ! ఏమిటా మొండివాదన? నీవింకా చిన్న పిల్లవు. అయినా అప్పుడే, వాళ్ళందరికిమల్లే నీకూ మూర్ఖత్వం పట్టుబడిందే!

# * పితృభూమి - ప్రభుత్వం

[గావ్రీలా, ఒక సేవకుడు. సైన్యంలోకి ఎప్పుడు రమ్మని పిలిస్తే అప్పుడు వెళ్ళడానికి సిద్ధంగా వుంచబడినవాడు. మిషా — అతని యజమాని కొడుకు. చిన్నపిల్లవాడు.]

గావ్రీలా: మిషా! నా ప్రియమైన చిన్నదొరా! ఇహ వెళ్ళొస్తాను. సెలవు. మనిద్దరినీ మళ్ళీ కలుసుకునేలా చేయమని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

మిషా: నీవు నిజంగా వెళ్ళిపోతున్నావా?

గావ్రీలా: అవును. తప్పదు! మళ్ళీ యుద్ధం వచ్చింది. యుద్ధం ఆరంభించగానే నేను వెళ్ళిపోవాలి. అందుకోసమే నన్ను అట్టిపెట్టారు.

మిషా: యుద్ధం ఎవరితో జరుగుతోంది? ఎవరు ఎవరితో పోట్లాడుతున్నారు?

గావ్రీలా: ఏమో, ఆ భగవంతుడికే తెలియాలి! అంతంత పెద్దవిషయాలు నాకు అర్థంకావు. నే నీవిషయం పత్రికలలో చదివాను; కాని కొంచెమైనా బోధపడలేదు. అందరూ అనుకుంటున్నారు—ఆస్ట్రియా ఏదో నేరం చేసిం

---

* మనం మన దేశాన్ని మాతృభూమి అని పిలిచినట్లే, విదేశీయులు తమ దేశాన్ని పితృభూమి అని పిలుస్తారు. మనం మాతృదేవతను పూజిస్తాం. వారికి పితృదేవతమీద అభిమానం మెండు. —అనువాదకుడు.

దట. మనమేమో వాళ్ళకు సహాయం చేయాలట.
వాళ్ళు—వాళ్ళ పేర్లు... ఏమిటో నాకు గుర్తులేవు.

మిషా: అయితే మరి 'నీవు' ఎందుకూ వెళ్ళడం? ఈ చక్రవర్తీ ఆ చక్రవర్తీ తన్నుకుంటున్నారు; తన్నుకోనీ. మనకేం పట్టిందీ?

గావ్‌రీలా: అలాఅంటే వీల్లేదు. జార్ చక్రవర్తి కోసం మనం యుద్ధం చేయాలి. జార్ చక్రవర్తి, పితృభూమి, సనాతన ధర్మం—వీటికోసం మనం ఏమైనా చేయాలి.

మిషా: మరి నీకు వెళ్ళాలనివుందా?

గావ్‌రీలా: ఎవరికైనా భార్యాబిడ్డల్ని వదిలిపెట్టి వెళ్ళాలని వుంటుందా దొరా? అందులోనూ ఇలాంటచోట వుండి, ప్రశాంతంగా, సుఖంగా జీవితం గడుపుకుంటున్నాను. అలాంటివాడికి ఆ యుద్ధంలోకి వెళ్లాలని ఎందుకు వుంటుంది?

మిషా: అయితే ఎందుకు వెడతావు? 'నేను రా'నని వాళ్ళతో చెప్పేసెయ్. వెళ్ళకుండా ఇక్కడే వుండు. వాళ్లు నిన్ను ఏం చేస్తారేం?

గావ్‌రీలా: [నవ్వుతూ] ఏంచేస్తారు దొరా! నన్ను బలాత్కారంగా లాక్కుపోతారు.

మిషా: ఎవరా లాక్కుపోయేవాళ్లు?

గావ్‌రీలా: ఎవరు? నాలాంటిమనుషులే! ప్రభుత్వాజ్ఞలకు బద్ధులయివున్న మనుషులు!

మిషా: వాళ్ళూ నీలాంటి మనుషులేనని చెపుతున్నావుగా!
మరి నిన్నెందుకు బలాత్కారంగా లాక్కుపోతారు?

గావ్రీలా: అలా చేయమని అధికార్ల ఉత్తర్వు. అధికార్లు, సేనానాయకులు ఆజ్ఞాపిస్తారు. వారి ఆజ్ఞల ప్రకారం ఎవరి నైనా సరే లాక్కుపోతారు.

మిషా: అయితే ఒకమాట. వాళ్ళుకూడా ఆ ఉత్తర్వులు తిరస్కరిస్తే? అప్పు డేమవుతుంది?

గావ్రీలా: వాళ్లు అలా తిరస్కరించడానికి వీలులేదు అబ్బాయిగారూ!

మిషా: ఎందుకు వీల్లేదూ?

గావ్రీలా: ఎందుకంటే... ఎందుకంటే, అదొక శాసనం. దాన్ని తిరస్కరించడానికి వీల్లేదు.

మిషా: శాసనమా? ఎలాంటిశాసనం అది?

గావ్రీలా: మీరు చాలా విచిత్రమైన ప్రశ్నలు అడుగుతున్నారు చినబాబూ! మీరు అడిగే విషయాలు వింతగా ఉన్నాయి. వాటికి జవాబుచెప్పడం నాచేత కాదు. ఓ! చాలాసేపయింది. మీతో కబుర్లుచెపుతూ కూచున్నాను. పనుంది; టీ పొయ్యిమీద పెట్టాలి టీ కాచడం ఇదే చివరిసారేమో!

# పన్ను లు

[గ్రామపెద్ద ఒకనిరుపేద గుడిసెలో ప్రవేశిస్తాడు. గుడిసెలో ఏడేండ్ల అమ్మాయి గ్రూష్కా తప్ప మరెవరూ లేరు. గ్రామపెద్ద చుట్టూ కలయ చూస్తాడు.]

గ్రామపెద్ద: ఇంట్లో ఎవరూ లేరూ?

గ్రూష్కా: అమ్మ ఆవును తోలుకురావడానికి వెళ్ళింది. అయ్యేమో దొరగారిదొడ్లో పనికెళ్ళాడు.

గ్రామ: సరేకాని, మీ అమ్మ రాగానే గ్రామపెద్ద వచ్చి వెళ్ళాడని చెప్పు. ఇక్కడికి రావడం ఇది మూడోసారి అనికూడా చెప్పు. ఇంతవరకూ ఇవ్వాల్సిన పన్ను ఇవ్వలేదు. ఆదివారంనాటికయినా పన్ను కట్టకపోతే ఆవును తోలుకుపోతానన్నానని చెప్పు.

గ్రూ: నీవు మా ఆవును తోలుకుపోతావా? నీవు దొంగవాడివా? ఉహుం. మా ఆవును తీసుకుపోయినా ప్పాలంటే ఒప్పుకోం, చెపుతున్నా!

గ్రామ: [మందహాసంచేస్తూ] అమ్మపిల్లా! ఏమోఅనుకున్నా. వేలెడంత లేవు, ఎన్నిమాటలు నేర్చుకున్నావే! నీ పేరేమిటి అమ్మాయ్?

గ్రూ: గ్రూష్కా.

గ్రామ: బాగుంది గ్రూష్కా! నీవు మంచిపిల్లవు. కాని, ఇది వినమ్మా! నేను దొంగను కాకపోయినా, ఆవునుమాత్రం తీసుకుపోతానని మీ అమ్మతో చెప్పు.

గూ్రి: మరి నీవు పొంగవ్రకాకపోతే, మా ఆవును ఎందుకు తోలుకుపోతావు?

గ్రామ: ఎందుకంటే రూల్సు. రూల్సు ప్రకారం మీరు పన్ను కట్టాలి. కట్టకపోతే పన్ను కింద ఆవును తోలుకుపోతాను, తెలిసిందా?

గూ్రి: పన్ను అంటే ఏమిటి?

గా్రిమ: భలేపిల్లవే! పన్ను అంటే ఏమిటని అడుగుతు న్నావా? జార్ చక్రవర్తి ఆజ్ఞ ప్రకారం ప్రజలు పన్నులు చెల్లించాలి.

గ్రూ: ఎవరికి చెల్లించాలి?

గ్రామ: ఎవరికేమిటి? జార్ చక్రవర్తికే అనుకో! ఆ తరు వాత ఆ సొమ్ము ఏంచేయాల్సిందీ ఆయనే నిర్ణయిస్తారు.

గ్రూ: అయితే చక్రవర్తి పేదవాడా? మేం పేదవాళ్ళం, ఆయనేమో భాగ్యవంతుడు. అలాంటప్పుడు ఆయన మాదగ్గర డబ్బు తీసుకోవడం ఎందుకూ?

గ్రామ: పిచ్చిపిల్లా! ఆ డబ్బు ఆయనస్వంతానికి తీసుకోవడం లేదు. మనకోసం— మన ఉపయోగాలకోసమే ఆయన అది తీసుకుంటున్నారు. అధికార్లకోసం, ఉద్యోగుల కోసం, సైన్యంకోసం, విద్యకోసం ఆ డబ్బంతా ఖర్చు పెడతారు. ఇవన్నీ మనమేలుకేగా!

గ్రూ: ఏమిటి మేలు? నీవు మాఆవును ఎత్తుకుపోతే మాకు మేలుకలుగుతుందా? వట్టిది. అలాచేస్తే మా కేమాత్రం ఉపయోగంలేదు.

గ్రామ: నీ కిప్పుడు అర్థంకాదు. పెరిగి పెద్దదానవయినతరువాత ఈ విషయాలన్నీ తెలుస్తాయి. సరే,అదంతా నీకెందుకులే? నే చెప్పినమాట మీ అమ్మతో చెప్పు. ఏం? చెపుతావా?

గ్రూ: ఇలాంటి అర్థంలేని పిచ్చిమాటలు నేను ఆమెతో చెప్పను. నీకూ, నీ జార్ చక్రవర్తికీ ఏపని అవసరమైతే ఆపని మీ ఇద్దరికోసమే చేసుకోండి. మాకోసం, మాకు అవసరమైన పని మేమే చేసుకుంటాం. అంతేకాని మా మేలుకోసం మీరు ఏపనీ చెయ్యక్కర్లేదు.

గ్రామ: ఓ! ఇది పిల్లకాదురా పిడుగు! ఇప్పుడే దీనివ్యవహారం ఇలావుంది. ఇహ పెరిగి పెద్దదయిందీ అంటే, పచ్చివిషంగా తయారవుతుంది! మా నోట్లో మట్టికొడుతుంది?

# తప్పులు ఎన్నుట

మిట్యా, 10 ఏండ్లబాలుడు
ఇల్యూషా, 9 ఏండ్లబాలుడు
సోన్యా, 6 ఏండ్లబాలిక

మిట్యా: మనం వంటిమీద బట్టలులేకుండా తిరుగవచ్చని పీటర్ సిమనోవిచ్‌తో చెప్పాను. కాని అతను అందుకు అంగీకరించలేదు. వంటిమీద బట్టలులేకుండా తిరగడం అసాధ్యం అన్నాడు. అప్పుడు నేను అతనితో ఈవిషయం నాకు మైఖేల్ ఇవానోవిచ్ చెప్పాడనీ, మనం మొహాలకు గుడ్డలులేకుండా చలిలో తిరగగలుగుతున్నప్పుడు అలాగే వంటిమీదమాత్రం బట్టలు లేకుండా ఎందుకు తిరుగలేమని అన్నాడనీ చెప్పాను. అలవాటుపడితే అలా చెయ్యడం కష్టం లేదన్నాడనికూడా చెప్పాను. అప్పుడు పీటర్ ఏమన్నాడో తెలుసా? 'నీకు ఆమాట చెప్పిన మైఖేల్ ఒట్టి మూర్ఖుడు. పిచ్చివాడు!' అన్నాడతను. [నవ్వుతూ] మరి నిన్న ఏంజరిగిందనుకున్నావు? పీటర్ ఇలాఅన్నాడని మళ్ళీ నేను మైఖేల్‌తో చెప్పాను. అప్పుడు మైఖేల్ 'ఆ పీటర్‌గాడు ఒట్టి అబద్ధాలకోరు. పిచ్చివాడు. వాడి మాటలు నమ్మకు. పిచ్చివాడు అంతకన్నా ఏంచెప్తాడూ?' అన్నాడు నాతో. [మళ్ళీ నవ్వుతాడు]

ఇల్యూషా: పీటర్ మైఖేల్‌ను పిచ్చివాడన్నాడు. మళ్ళీ మైఖేల్ పీటర్‌ను పిచ్చివాడన్నాడు. ఇంకేం! సరిపోయింది.

మిట్యా: కాని నిజంగా ఆ ఇద్దరిలో పిచ్చివాళ్ళెవరో నాకు తెలియడంలేదు.

సోన్యా: వాళ్ళిద్దరూ పిచ్చివాళ్ళే. ఒకడు పరాయివాణ్ణి పిచ్చివాడని అంటే, ముందు తనే పిచ్చివాడన్నమాట.

ఇల్యూషా: సరే. ఇప్పుడు నీవు వాళ్ళిద్దరినీ పిచ్చివాళ్ళని అంటున్నావు. కనుక నీవుకూడా ఒక పిచ్చిదానివే!

మిట్యా: వారిద్దరూ ఒకరినొకరు పరోక్షంలో 'నీవు పిచ్చివాడి వంటే, నీవు పిచ్చివాడ' వనుకున్నారు. ఇలాంటి చాటుమాటలు నేను సహించను. నేను పెద్దవాణ్ణి అయిన తరువాత ఇలాంటి తప్పుడుపనులు చేయను. ఎవరినైనా సరే అడగదలుచుకున్న విషయం మొహాన్నే అడిగేస్తాను.

ఇల్యూ: నేనుకూడా అంతే!

సో: నేనుమాత్రం అలాకాదు. నా ఇష్టంవచ్చినట్లు చేస్తాను.

మిట్యా: 'నా ఇష్టంవచ్చినట్లు'— అంటే ఏమిటి నీఉద్దేశ్యం?

సోన్యా: ఏముంది! చెప్పాలనుకున్నప్పుడు నా మనసులో వున్నది చెప్పేస్తాను. అక్కర్లేదనుకున్నప్పుడుమానేస్తాను. అదంతా నా ఇష్టాన్నిబట్టి వుంటుంది.

ఇల్యూ: దీన్నిబట్టి నీవు పిచ్చిదానివని ఇప్పుడే కన్పిస్తోంది.

సోన్యా: మరి నీ సంగతేమిటి? ఒకరినిగురించి తప్పుడు మాటలు అననని ఇప్పుడే కదా చెప్పావు? మళ్ళీ ఆ తప్పే చేస్తున్నావేం?

ఇల్యూ: అవును. నేను నీవు లేనప్పుడు—చాటున ఆ మాట అనడంలేదు నీ ఎదుటే అంటున్నాను!

# ఘా త ప య

మాషా } ఇద్దరు పిల్లలు
మిషా }
ఒక వృద్ధురాలు.

[మాషా, మిషా వాళ్ళ ఇంటిముందు ఆడుకుంటూ బొమ్మరిల్లు కడుతూవుంటారు.]

మాషా: [మిషాతో కోపంగా] ఛీ! అలాకాదు. ఆ కర్రతీసి అవతల పారెయ్. పిచ్చిపిల్లా!

వృద్ధురాలు: [ఇంట్లోంచి బయటికి వస్తుంది. పిల్లలు ఆడుకుంటున్న స్థలంలో నిలబడి తనలోతాను పొంగిపోతూ ఇలా అనుకుంటుంది.] క్రీస్తు ప్రభువు ఆమెను రక్షించుగాక! నిజంగా ఆ తల్లి పుణ్యాత్మురాలు! దేవత! ఎవరొచ్చినా లేదు అనదు మహాతల్లి. అందరినీ దయతలుస్తుంది.

[పిల్లలు ఆడుకోవడం మానేసి ఆ వృద్ధురాలివంక చూస్తారు]

మిషా: నీవు ఎవరితో మాట్లాడుతున్నావు?

వృద్ధురాలు: మీ అమ్మగారినిగురించి. ఆ తల్లి దేవుడిపేరు చెప్పి మా పేదవాళ్ళను కనికరిస్తుంది. ఇప్పుడే ఆమె నా కొక పాతకోటు ఇచ్చింది. తాగడానికి టీ ఇచ్చి, మరి కొంత డబ్బుకూడా ఇచ్చింది. ఆ చల్లని తల్లిని కలకాలం దేవుడు రక్షించుగాక! ఈ తల్లికీ వాడికీ ఎక్కడ పోలిక? వాడు నాస్తికుడు! కటికి మూర్ఖుడు. వాడికి హృదయం లేదు. అందుకే వాడు 'సైబీరి'వాళ్ళను చాలమందిని

చూశాను మీ అందరికీ ఊరిమీద తిరిగి అడుక్కోవడం తప్ప మరో పని లేదు. పో పో!' అంటూ కసురుకున్నాడు. వాడికుక్కలు నామీదికి ఎగబడ్డాయి. ఓ! ఏంకుక్కలు! వాటిని తప్పించుకుని ఇవతలపడేసరికి నా తలప్రాణం తోకకువచ్చింది.

మాషా: అతను ఎవరు?

వృద్ధురాలు: ఆ పచారుకొట్టుకు ఎదురుగావున్నాడే అతను. పాషాణహృదయుడు. పోనీలే! ఈ తల్లినిమాత్రం నేను జన్మ జన్మాలకూ మరచిపోలేను—బంగారుతల్లి. అష్ట కష్టాల్లో, నిష్టదరిద్రంలోవున్న నన్ను ఆదరించి ఆధారం కల్పించింది. లోకంలో ఇలాంటి మహాతల్లులేకనుక లేక పోతే మాబోటి పేదవాళ్ళం బ్రతకగలమా? [ఏడుస్తుంది]

మాషా, మిషా: [ఇద్దరూ ఒకేసారి] అవును. మా అమ్మ చాలదయగలది.

వృద్ధురాలు: నా చిట్టి పాపాయిలూ! మీరూ పెరిగి పెద్దవా రయినతరువాత మీ అమ్మగారిలాగానే ప్రవర్తించండి. పేదవాళ్ళను మరచిపోకండి. అప్పుడు దేవుడుకూడా మిమ్మల్ని మరిచిపోడు. [వెళ్ళిపోతుంది]

మిషా: పాపం, పేదరాలు!

మాషా: మనఅమ్మ ఆమెకు ఏదో సహాయం చేసినందుకు నాకు ఎంతో సంతోషంగావుంది.

మిషా: మనదగ్గర చాల డబ్బుంది కదా! ఆమెకు ఎందుకు ఇవ్వకూడదూ? మనకు దాంతో పనిలేదు. ఆమెకు అక్కరకువస్తుంది.

మాషా: జాన్ ప్రభువు ఏంచెప్పాడో నీకు జ్ఞాపకం వుందా? 'నీవద్ద రెండు కోట్లు వుంటే అందులో ఒకటి ఇతర్లకు ఇచ్చెయ్యి.' అని చెప్పాడు.

మిషా: అవును. నేను పెద్దవాణ్ణయింతరువాత, నాకు ఉన్నదంతా ఇచ్చేస్తాను.

మాషా: నీవు అలా చేయకూడదు!

మిషా: ఎందుకని?

మాషా: అంతా ఇచ్చేస్తే అప్పుడు నీపని ఏమవుతుంది?

మిషా: ఏమవుతుంది? ఏమీకాదు. అందరినీ మనం దయతలిస్తే, మనకు అంతా బాగానే జరిగిపోతుంది. [అలా అంటూ అతను ఆడుకోవడం మానేసి గదిలోకి వెడతాడు. పుస్తకంలోంచి ఒక కాగితం చింపి దానిమీద ఏదో వ్రాసి జేబులో పెట్టుకుంటాడు. ఆ కాగితంమీద 'మనకు భూతదయ వుండవలెను' అని వ్రాసివుంటుంది.]

# మద్యపానం

మకార్కా : 12 ఏండ్ల బాలిక.
మర్ఫూట్కా 6 ఏండ్ల బాలిక.
పవ్లూష్కా : 10 ఏండ్ల బాలిక.
ఒక ఉపాధ్యాయుడు.

[మకార్కా, మర్ఫూట్కా—వీరిద్దరూ ఒక ఇంట్లోంచి వీధిలోకి వస్తారు. మర్ఫూట్కా ఏడుస్తూఉంటుంది. పక్కఇంటి వాకిట్లో పవ్లూష్కా నిలబడివుంటుంది.]

పవ్లూష్కా. ఎక్కడికీ ఇంతరాత్రివేళ పోతున్నారు?

మకార్కా: అతను మళ్ళీ తాగివచ్చాడు.

పవ్లూష్కా: ఎవరు? ప్రొఖోర్ బాబాయా?

మకా: అంతకన్నా ఇంకెవరుంటారు?

మర్ఫూట్కా: అతను మా అమ్మను కొడుతున్నాడు.

మకా: నే నిక ఇంట్లోకి వెళ్ళను. ఆయన నన్నుకూడా కొడుతున్నాడు. [గడపమీద కూచుంటుంది.] రాత్రిఅంతా ఇక్కడే వుంటాను. ఇంట్లోకి వెళ్ళను.

[ఒక్కక్షణం నిశ్శబ్దం. మర్ఫూట్కా మళ్ళీ ఏడుస్తుంది.]

పవ్: అబ్బ! ఇహ ఊరుకో! ఏడిస్తే లాభంలేదు. మనం ఏం చేయగలం? నీకే చెప్పేది! ఇహ ఏడవకు.

మర్: [ఏడుస్తూనే] నేనుకనుక జార్ చక్రవర్తిని అయినట్లయితే, ఆయనకు 'వోడ్కా' ఎవరు ఇస్తున్నారో వాళ్ళను చావగొట్టేదాన్ని. ఎవరినీకూడా 'వోడ్కా'ను అమ్మనీయకుండా చేసేదాన్ని!

మకా: అదేం ఆలోచన? నీమొహంఆలోచన! అసలు జార్ చక్రవర్తే వోడ్కా అమ్ముతున్నాడు. తనకు వచ్చేలాభం కాస్తా పోతుందని, ఇతరులు ఎవరూ అమ్మకుండా చేస్తున్నాడు. అదీ సంగతి.

పవ్: నీవు చెప్పేదానికి అర్థంలేదు. అదంతా అబద్ధం!

మకా: అబద్ధమా! అయితే వెళ్ళి ఎవరినైనా అడుగు. అకులీనాను ఎందుకు జైల్లో పెట్టారో అడుగు. ఆమె లైసెన్సు లేకుండా 'వోడ్కా' అమ్మింది. అలా చేయడంవల్ల చక్రవర్తికి నష్టం వస్తుంది. అందుకే ఆమెను జైల్లో పెట్టారు!

పవ్: నిజంగా! అందుకా జైల్లో పెట్టింది? మరి వాళ్ళు ఏదో చట్టాన్ని వ్యతిరేకించింది అంటున్నారే...

మకా: అవును. లైసెన్సులేకుండా 'వోడ్కా' అమ్మడం చట్టాన్ని వ్యతిరేకించడమే.

మర్: నేను 'వోడ్కా'ను ఎవరూ అమ్మకుండా చేసేస్తాను. వోడ్కాయే ఇన్నికష్టాలూ తెచ్చిపెడుతున్నది. ఒక్కోసారి ఆయన బాగానేవుంటాడు. కాని తాగితే సరి. అందరినీ చచ్చేటట్లు కొడతాడు.

పవ్: ఏమిటో మీమాటలు? నాకు విచిత్రంగా వుంటాయి! రేపు నేను మా పంతులుగారిని అడుగుతాను. ఆయనకు ఈ విషయాలన్నీ తెలుసు.

మకా: సరే. ఆయన్నే అడిగి తెలుసుకో.

[మరుసటిరోజు ఉదయాన మకార్కాతండ్రి ప్రొఖోర్ తాగుడుమైకంలోంచి లేచాడు. తాగివున్నప్పుడు

అతన్ని ఒక కుక్క కరిచింది. ఆ కుక్క వెంట్రుకొకటి *
తీసుకోవడానికి ఇప్పుడు వెళ్ళాడు. మకార్కా తల్లి
మూలుగుతూ రొట్టెచేస్తోంది. భర్త చావుదెబ్బలు
కొట్టినందున ఆమెవళ్ళంతా పచ్చిపుండయిపోయింది.
అదేపనిగా ఏడవడంవల్ల కళ్ళు వాచిపోయినాయి. పవ్
లూష్కా బడికి వెళ్ళింది. అప్పటికింకా కుర్రవాళ్ళు పోగు
కాలేదు. ఉపాధ్యాయుడు ముందువసారాలో కూచుని
పొగపీలుస్తున్నాడు. అప్పుడే కుర్రవాళ్ళు బళ్ళోకి వస్తు
న్నారు.]

పవ్: [ఉపాధ్యాయుణ్ణి సమీపిస్తూ] పంతులుగారూ! నా కో
విషయం చెప్పండి... జార్ చక్రవర్తి 'వోడ్కా' అమ్ము
తాడనీ, కాని 'వోడ్కా'ను అమ్మినందుకు అకులీనాను
జైల్లో పెట్టారనీ నిన్న నాతో ఎవరో చెప్పారు. అది
నిజమేనా?

ఉపాధ్యాయుడు: నీ కా మాట చెప్పినవాళ్ళకు బుద్ధిలేదు.
అలాంటి మాటలు ఎప్పుడూ నమ్మకు. జార్ చక్రవర్తి
వోడ్కాయేకాదు. మరేవస్తువుకూడా అమ్మడు. అందుకే
ఆయన చక్రవర్తి అయినాడు.. ఇహ అకులీనాను జైల్లో
పెట్టింది ఎందుకంటే, లైసెన్సు లేకుండా ఆమె వోడ్కా
అమ్మింది. దానివల్ల ప్రభుత్వకోశాగారానికి నష్టం
వస్తుంది.

---

* కుక్క కరిస్తే దాని వెంట్రుక పీకడమే మందుఅని అక్కడి వాళ్ళు భావించేవారు. —అనువాదకుడు.

పవ్: ఆమె ఎలా నష్టానికి కారణం అయింది?

ఉపా: ఎలాగో చెప్తాను విను. సారామీద సుంకం వుంది. ప్రతి 'వెడ్రో' అనగా ప్రతి 2.7 గ్యాలన్ల సారాయి ప్రభుత్వానికి రెండు రూబుల్సు చొప్పున గిట్టుతుంది. కాని దాన్ని ఎనిమిది రూబుల్సు యాభై కోపెక్కులకు అమ్మకం చెయ్యాలి. పోతే ఆ తేడాసొమ్ము ప్రభుత్వానికి లాభం. ఆవిధంగా ప్రభుత్వానికి పెద్ద మొత్తం—దాదాపు డెబ్బైభకోట్ల రూబుల్సు ఆదాయం వస్తుంది.

పవ్: అంటే 'వోడ్కా' ఎంత ఎక్కువ తాగితే ప్రభుత్వానికి అంత ఎక్కువ లాభంవస్తుంది కదండీ?

ఉపా: అవును. అంత డబ్బు రాకపోతే, మనకు ఉపయోగకరమైన ఈ బళ్లు, సైన్యం; ఇవన్నీ వుండేవికావు. ఆ డబ్బుతోటే మన అవసరాలన్నీ తీరుతున్నాయి.

పవ్: అయితే పంతులుగారూ! మరోమాట. ఈ పనులన్నీ ప్రతివారికీ ఉపయోగకరమైనవని అంటున్నారుకదా? అలాంటప్పుడు ఆ కావల్సిన డబ్బు ఏదో మనదగ్గర్నుంచే సరాసరి తీసుకోకూడదూ? 'వోడ్కా' ద్వారా సంపాయించడం దేనికి?

ఉపా: [కోపంగా] 'వోడ్కా' ద్వారా సంపాయించడం దేనికని అడిగితే ఏంచెప్పను? అది రూల్సు! అలా చట్టం నిర్ణయించారు!—సరే, పిల్లలూ! అందరూ వచ్చారు కాని, ఇహ మీ మీ స్థలాల్లో కూచోండి!

# మరణదండన

పీటర్ పెట్రోవిచ్, ఒక ప్రొఫెసరు.

మరియా ఇవానోవ్నా, అతని భార్య.

ఫెద్యా, వారి కొడుకు, 9 ఏండ్ల బాలుడు.

ఇవాన్ వాసిలోవిచ్, మిలిటరీ పబ్లిక్ ప్రాసిక్యూటరు.

[మరియా ఇవానోవ్నా బట్టలు కుడుతూ వుంటుంది. ఫెద్యా తండ్రి చెప్పేమాటలు వింటూవుంటాడు.]

ఇవాన్ వాసిలోవిచ్: చరిత్ర బోధించిన సత్యాన్ని ఎవరూ కాదనలేరు. సమాజంలో దుర్మార్గులు వుండకూడదు. వారివల్ల అనేక ప్రమాదాలున్నాయి. వారిని నాశనం చేయడం మనవిధి. ఫ్రాన్సులో విప్లవం వచ్చినతరువాత ఈ విషయం రుజువైంది. అంతేకాదు; చరిత్ర పరిశీలిస్తే అనాదినుంచీ ఇప్పటివరకూ, ఆఖరుకు మన రష్యాలో కూడా ఇది యదార్థమని తెలుస్తోంది.

పీటర్ పెట్రోవిచ్: కాదు, అలా అని నిశ్చయంగా చెప్పలేం. సమాజంలోని దుర్మార్గులను నాశనంచేయడంకోసం విపరీతమైన చట్టాలు ఏర్పరచడం, మరణ శిక్షలు అమలు పరచడం న్యాయమని తోచదు. ఇలాంటి చట్టాలు ఇంకా విపరీత, విపత్కర పరిస్థితులకు దారితీయవచ్చు.

ఇవాన్: ఇలాంటి చట్టాలవల్ల మేలుకలుగదనీ, ముప్పు సంభవిస్తుందనీ ముందుగానే ఊహించడానికి మనకు హక్కు-

లేదు. లేక ఈ చట్టాలను అమలుపరచడంలోనైనా కొన్ని లోపాలు తప్పవని చెప్పడానికీ వీలులేదు. అది మొదటిది. పోతే రెండోది ఏమిటంటే, మానవుల స్వభావాలే పూర్తిగా మారిపోయి, మానవత్వమే నశించి, వారు క్రూరమృగాలుగా తయారైనప్పుడు, కఠిన శిక్షలు అమలుపరచాల్సిందే. తప్పదు. ఉదాహరణకు చెప్తాను. ఒకడు తనకు మూడొందల రూబుల్సు వస్తాయనే ఆశతో ఒకవృద్ధురాలిని, ఆమె బిడ్డలు ముగ్గురినీ గొంతు కోస్తాడు. అలాంటి నేరం చేసినవాడికి అతి కఠినమైన దండన విధించకపోతే, నీవు అతన్ని ఇంకేంచేస్తావు?

పీటర్: అందుకని మరణదండన విధించాలంటే నేను ఒప్పుకోను. పూర్తిగా మరణదండన పనికిరాదనికూడా నేను అనడంలేదు. కాని అందులో కొంత తారతమ్యం వుండాలి. ముఖ్యంగా పటాలమండలి న్యాయసభలు (కోర్టుమార్షల్) విధించే శిక్షలతో నేను అంగీకరించలేను. తరుచుగా జరుగుతున్న ఈ దండనలవల్ల మనుషులు మంచివాళ్ళుగా మారిపోయి, రాను రాను ఇంకా దుర్మార్గులు అవుతున్నారు. తమ సోదరులనే చంపడంవల్ల మానవ హృదయాలు మరింత కలుషితమై, అవినీతికి దారితీస్తున్నాయి.

ఇవాన్: చివరకు జరిగేదానితో మనకు పనిలేదు. ప్రస్తుతం మనకు సత్ఫలితమే కనపడుతోంది...

ఫెడ్యా: మరి అయితే, నాన్నా! మనం ప్రతిమనిషినీ ప్రేమిం చాలనీ, ప్రతి మనిషినీ క్షమించాలనీ క్రీస్తుప్రభువు చెప్పాడుకదా! అలా ఎందుకు చెప్పినట్లు?

పీటర్: అవును. చెప్పాడు. అలాచేస్తే మంచిదే. కాని అందరూ అలాచేయడం సాధ్యంకాదు.

ఫెడ్యా: ఎందుకు సాధ్యంకాదు?

పీటర్: అబ్బ! ఎందుకేమిటి? సాధ్యంకాదు! [అంటూ ఇవాన్ వాసిలోవిచ్ వైపు చూస్తాడు. ఫెడ్యామాటలు వింటూ ఆయన మందహాసంచేస్తూవుంటాడు.] కనుక, వాసి లోవిచ్! ఈ ప్రత్యేకమైన చట్టాలనుగురించీ, పటాలమం దలి న్యాయసభలు విధించే శిక్షలనుగురించీ నా కింకా అర్థంకాలేదు అయ్యేట్లు లేదు కూడాను. మనకంటె మన కుర్రవాడే తెలివైనవాడిలా కనిపిస్తున్నాడు.

# చెరసాలలు

శంకా, 13 ఏండ్లవయస్సు. అక్సూట్కా, 10 ఏండ్లవయస్సు.
డ్రిమిట్కా, 10 ఏండ్లవయస్సు. పలాష్కా, 9 ఏండ్లవయస్సు.
వాంకా, 8 ఏండ్లవయస్సు

[పిల్లలంతా పుట్టకొక్కులు ఏరుకొని బావివొడ్డున కూచునివుంటారు.]

అక్సూట్కా: పాపం, మెట్రినా పిన్నికీ ఆమెపిల్లలకూ ఎన్ని కష్టాలొచ్చాయి! దిక్కూ మొక్కూ లేకుండా అల్లాడి పోతున్నారు.

వాంకా: వాళ్ళకు అన్నిచిక్కులు ఎందుకు వచ్చాయి?

పలాష్కా: ఏముంది, వాళ్ళనాన్నను జైల్లో పెట్టారు.

వాంకా: జైల్లో ఎందుకు పెట్టారు?

అక్: ఏమో, ఎవరికితెలుసు? వాళ్లు వచ్చి అతన్ని పట్టుకున్నారు. తరువాత లాక్కునిపోయారు. అదంతా మేం కళ్లారా చూచాం...

శంకా: అతను గుర్రాలు దొంగిలించినందుకు, వాళ్లు అతన్ని పట్టుకుపోయారు. జెమ్కిన్ గుర్రాన్ని దొంగిలించింది అతనే. క్రాస్నోవ్ గుర్రం కనిపించకుండాపోయింది. అదికూడా అతనిపనేనట! మా గోడిగనుకూడా అతనే ఎత్తుకుపోయాడు. ఇట్లాంటి దొంగముండాకొడుకును జైల్లో పడేయకుండా ముద్దుపెట్టుకుంటారా ఏమిటి?

అక్: అవును. ఆ సంగతి నాకు తెలుసు. అయినప్పటికి ఆ పిల్లలనుచూస్తే నా కడుపు తరుక్కుపోతుంది. నీకు తెలు

సునో లేదో! వాళ్ళు నలుగురుపిల్లలు! నిరుపేదలు! తిన డానికి రొట్టెముక్క కూడా లేక అల్లాడుతున్నారు. ఇవాళ మా ఇంటికి వచ్చి బిచ్చం అడిగారు.

మిట్కా: దొంగతనం చేసింది వాళ్లు కాదు—వాళ్ళ నాన్న. మరి ఏమీఎరగని ఆ పిల్లలకు బిచ్చమెత్తుకునేగతి ఎందుకుపట్టాలి?

శంకా: మరి అయితే దొంగతనం ఎందుకు చేయాలి?

మిట్కా: మళ్ళీ ఆ మాటే అంటావేం? దొంగతనంచేసింది పిల్లలుకాదు, తండ్రి. పిల్లలకెందుకు బుద్ధిచెప్పాలి?

శంకా: అబ్బ! వసపిట్టలా వాగడంతప్ప నీకేం తెలిదు. పిల్లలు పిల్లలు! ఎంతసేపూ అదేమాట చెపుతావేం? అతను దొంగతనం ఎందుకు చేశాడో తెలుసా? ఆ పిల్లల మూలానే! అంతమంది పిల్లలు ఉండబట్టే అతను దొంగ తనంచేశాడు.

వాంకా: అయితే అతన్ని జైల్లో పెట్టి ఏం చేస్తారు?

అక్: ఏంచేయరు. జైల్లోపడేసి వుంచుతారు; అంతే.

వాంకా: అతనికి తిండిపెడతారా?

శంకా: ఆ, పెడతారు. గుర్రాల్ని దొంగిలించిన ఆ పాడువెధ వకు అన్నీ పెడతారు. అతనికి జైలుఅంటే భయ మేముంది? కావల్సినవన్నీ పెడతారు. కమ్మగా మెక్కి కూచుంటాడు. నేనుకనుక జార్ చక్రవర్తిని అయినట్ల యితే, ఈ గుర్రాల్ని దొంగిలించేవాళ్ళకు సరిగా బుద్ధి చెప్పేవాణ్ణి. దొంగతనం చేయకూడదని ఉపదేశించే వాణ్ణి! కాని ఇప్పుడు ఏం జరుగుతున్నదో తెలుసా? అతను

హాయిగా జైల్లో కూచుంటాడు. అతనిచుట్టూ ఇంకా అనేకమంది దొంగలు వుంటారు. వాళ్ళంతా కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, ఇంకా పెద్ద పెద్ద దొంగతనాలు ఎలా చెయ్యాల్సిందీ ఒకరినుండి ఒకరు నేర్చుకుంటారు. పట్టుబడకుండా వుండే ఉపాయాలుకూడా ఎన్నో ఒకరి నుండి ఒకరు తెలుసుకుంటారు. ఒకసారి మా తాతయ్య చెప్పాడు- పెట్రూఖా మొదట్లో మంచిపిల్లవాడట. కాని ఒకసారి జైలుకు పోయివచ్చినతరువాత అతను పూర్తిగా మారిపోయాడట. పచ్చి రౌడీగా, బందిపోటు దొంగగా తయారైనాట్ట. అప్పట్నుంచీ అతను...

వాంకా: అయితే వీళ్ళను జైల్లో పెట్టినందువల్ల ఉపయోగం ఏమిటి?

శంకా: అబ్బ! నాకు తెలీదు. పోయి వాళ్ళనే అడుగు!

అక్: అతన్ని జైల్లో పెట్టి, తిండిపెట్టి, తరునాత...

శంకా: ఇంకా బాగా దొంగతనంచేయడం నేర్పుతారు!

అక్: ఇక్కడేమో అతని బిడ్డలు, వాళ్ళతల్లి తిండిలేక నుల మల మాడిపోతారు! వాళ్లు మా పొరుగున వున్నారు. చూస్తోంటే నాకు విచారంవేస్తోంది. వాళ్ళగతి ఏమవు తుందో! మా ఇంటికొచ్చి బిచ్చం అడుగుతున్నారు. మేంమాత్రం ఎక్కణ్ణుంచి తెచ్చిపెడతాం?

వాంకా: అయితే వాళ్ళు మనుషులను జైల్లో ఎందుకు పడు తున్నట్లు?

శంకా: అలాంటి దొంగలను జైల్లోపెట్టక మరేంచేస్తారు!

వాంకా: ఏంచేస్తారు!...ఏదోఒకటి...అందువల్ల......

శంకా: 'ఏదో ఒకటి' అని నీవు అంటున్నావుగానీ ఆ చేయాల్సింది ఏమిటో నీకే తెలీదు! నీకంటె మహా మహావాళ్లు, తెలివైనవాళ్ళు ఆలోచించి ఆలోచించి మరో మార్గం తోచక, వాళ్ళను జైల్లో పడేశారు, అంతే!

పలాష్కా: నేను కనుక మహారాణిని అయినట్లయితే... ...

అక్: [నవ్వి] అయినట్లయితే ఏం చేసేదానివి మహారాణీ?

పలాష్కా: ఏం చేసేదాన్నా? చెప్తాను విను. ఎవరూ దొంగతనం చేయకుండా, పిల్లలు ఏడవకుండా చేసేదాన్ని.

అక్: బాగానేవుంది. కాని అందుకోసం ఏం చేసేదానివి?

పలాష్కా: అందరికీ కావల్సినవన్నీ ఉండేలా ఏర్పాట్లుచేసేదాన్ని. ఎవరికీ ఇబ్బంది లేకుండా, అన్నిసుఖాలు కలిగించేదాన్ని. తప్పుచేసే అవసరం లేకుండా అందరినీ హాయిగా వుంచేదాన్ని.

శంకా: నీవు చెప్పింది చాలాబాగుంది మహారాణీ! కాని ఆ పని ఎలా చేస్తావని అడుగుతున్నా?

పలాష్కా: ఎలాచేస్తానో నాకు తెలీదు. కాని చేస్తాను.

మిట్కా: సరే, బాగానే వుందిగాని, ఇహ మనం అడివికి పోదామా? అక్కడ గుబురుగా కొండరావిచెట్లు ఉన్నాయి. మొన్న అక్కడే, ఆడపిల్లలంతా బోలెడన్ని పుట్టగొక్కులు పట్టుకొచ్చుకున్నారు.

శంకా: ఈ సలహా బాగుంది. అందరం వెడదాం. పదండి. మహారాణీ! మరి నీమాట ఏమిటి? నీవూ వస్తావా? వస్తే వచ్చావుకాని, తెలివి ఎక్కువై పట్టుకున్న పుట్టగొక్కులు సగం క్రింద పారబోసేవు! జాగ్రత్త! [అంతా నిష్క్రమణ]

# సంపద

[భూస్వామి, అతని భార్య, కొడుకు—ఆరేండ్లబాలుడు ముందువసారాలో కూచుని టీ తాగుతూవుంటారు. మంచి వయసులోవున్న దేశదిమ్మరి ఒకడు అక్కడికి వస్తాడు.]

భూస్వామి: [ఆగంతుకుడితో]ఎవరది?

దేశదిమ్మరి: [వినయంగా వంగి నమస్కరిస్తూ] నేను అయ్యగారూ! పనిలేని దౌర్భాగ్యుణ్ణి. కనికరించండి! కడుపుకు తిండిలేక, కట్ట బట్టలేక అవస్థపడుతున్నాను. నేను మాస్కో నుంచి వస్తున్నాను. ఇంటికి పోతున్నాను అయ్యగారూ! తమరిని ఏదైనా అడుక్కుందామని వచ్చాను. పేదవాణ్ణి. దయతలచండి!

భూస్వామి: నీకు ఇలాంటి అవస్థ ఎందుకుపట్టింది?

దేశ: ఏంచేయను బాబుగారూ! డబ్బులేదు.

భూస్వామి: ఏదైనా పని చెయ్యకపోయావా? పనిచేసుకుంటే ఈ బాధ వచ్చేదికాదే?

దేశ: పనిచెయ్యడానికేం? సంతోషంగా చేస్తాను. కాని దొరికితేనా! ఈరోజుల్లో ఎక్కడా పనులు లేవు అయ్యగారూ! పనులన్నీ మూలబడ్డాయి.

భూస్వామి: ఇతరులు అనేకమంది పనులు చేసుకుంటున్నారు. మరి నీ ఒక్కడికే లేకుండాపోయిందా?

దేశ: నిజం అయ్యగారూ! పని దొరికితే ఎంతో సంతో షించేవాణ్ణి. కాని దొరకందే. నన్ను కనికరించండి. రెండురోజులబట్టీ తిండిలేక మాడిపోతున్నాను.

భూస్వామి: [తన డబ్బుసంచి చూస్తాడు. పిమ్మట తన భార్యతో] నీదగ్గర ఏమైనా చిల్లరడబ్బు లున్నాయా? నా దగ్గర అన్నీ నోట్లే ఉన్నాయి. ♦

భార్య: [కొడుకు వాస్యాతో] బాబూ! గదిలోకెళ్ళి నా మంచం ప్రక్కన చిన్నబల్లమీద చూడు. డబ్బుసంచి వుంటుంది, పట్టుకురా! నా చిట్టితండ్రివి కదూ!

వాస్యా: [తల్లిమాట ఏమాత్రం వినిపించుకోకుండా దేశ దిమ్మరివంక తేరిపారచూస్తుంటాడు.]

భార్య: వాస్యా! నీకే చెప్పేది. వినిపించడంలా? [చొక్కా పట్టుకుని లాగుతూ] వాస్యా!

వాస్యా: ఏమిటే అమ్మా? [ఆమె తిరిగి ఇందాక చెప్పిన మాటే చెపుతుంది. వాస్యా కుర్చీలోంచి గభాలున క్రిందికి దూకుతాడు.] అలాగే అమ్మా [దేశదిమ్మరివంక రెప్ప వాల్చకుండా చూస్తూనే లోపలికి వెడతాడు.]

భూస్వామి: [దేశదిమ్మరితో] ఒకనిముషం ఆగు. [మళ్ళీ అతను భార్యవైపుకు తిరిగి మెల్లగా ఫ్రెంచిభాషలో] ఇలా పనిలేకుండా తిరిగే దేశదిమ్మరులు ఎంతోమంది వున్నారు. సోమరితనంవల్లనే వీళ్ళంతా ఇలా తయా

---

♦ ఆయన ఈమాటలు ఫ్రెంచిభాషలో అన్నాడు. అందువల్ల దేశ దిమ్మరికి అర్థంకాలేదు.

—అనువాదకుడు

రైనారు. కాని నిజంగా ఇతను ఆకలితో అల్లాడు తున్నట్లయితే, చూడు, ఎంతదారుణమో!

భార్య: కాదు. వాళ్ళు కాస్త వుంటే గంపంత చెపుతారు. నేను విదేశాలలోకూడా చూచాను. న్యూయార్కులో నూరువేలమంది పనిలేనివాళ్ళున్నారు. ఇదంతా వాళ్ళ వంటిబద్ధకంవల్లనే. మీ కింకా కాస్త టీ పోయనా?

భూస్వామి: అవును. ఈసారి కొంచెం 'లైటు'గా కలుపు. [పొగపీలుస్తూ మౌనంగా కూచుంటాడు]

[దేశదిమ్మరి వారివంక చూస్తాడు. తల ఆడిస్తాడు. దగ్గుతాడు. ఎలాగైనా వారు తనసంగతి పట్టించుకోవా లని నానాతంటాలుపడతాడు. అంతలో వాస్యా డబ్బుసంచి తీసుకొని పరుగెత్తుకుంటూ వస్తాడు. తల్లి కిచ్చి, తిరిగీ దేశదిమ్మరివంక అదేపనిగాచూస్తుంటాడు.]

భూస్వామి: [సంచిలోంచి మూడుపెన్నీలనాణెం ఒకటి తీస్తాడు.] ఇదుగో— నీపేరేమిటి— ఇది తీసుకో!

[దేశదిమ్మరి తన తలపైటోపీతీసి, తలవంచి నమస్క రిస్తూ ఆ డబ్బు తీసుకుంటాడు.]

దేశదిమ్మరి: నమస్కారం అయ్యగారూ! పేదవాణ్ణి గనికరించారు. మీ సహాయానికి కృతజ్ఞుణ్ణి.

భూస్వామి: నీకు పనిదొరకలేదు. అదే నాకు విచారంగావుంది. పని దొరికినట్లయితే వస్తుండాల్సిన అవసరంలేదు. ఎవ

రైతే పనిచేస్తాడో వాడికి పరాయివాణ్ని అడుక్కోవల సినపని లేదు.

దేశదిమ్మరి: [టోపీ పెట్టుకుని వెనక్కు తిరిగి వెళ్ళిపోతూ] వాళ్ళు చెప్పింది నిజమే.

'పని చేసీ చేసీ నడుములు పడిపోతాయి
సంచులుమాత్రం నిండక తనువులు చెడిపోతాయి'
[అనుకుంటూ వెళ్ళిపోతాడు.]

వాస్యా: అతను అనేది ఏమిటీ?

భూస్వామి: రైతులు చెప్పుకునే ఏదో అర్థంలేని సామెత; 'పని చేసీచేసీ నడుములు పడిపోతాయి, సంచులుమాత్రం నిండక తనువులు చెడిపోతాయి'

వాస్యా: అంటే అర్థం ఏమిటీ?

భూస్వామి: అంటే, కష్టంచేసేవాళ్ళకు ఎముకలు గుల్ల అవుతాయేగాని, సంపదమాత్రం ఎన్నటికీ అబ్బదని భావం.

వాస్యా: అయితే అది అబద్ధమా?

భూస్వామి: కొంతవరకు అబద్ధమే. వాడిలాగానే పనిచేయకుండా తిరిగేవాళ్ళు ఎప్పుడూ బీదవాళ్ళుగానేవుంటారు.

వాస్యా: అయితే మనం ఎలా భాగ్యవంతులం అయ్యాం? మనం పనిచెయ్యడంలేదే!

భార్య: [నవ్వుతూ] నాన్నగారు పనిచేస్తున్నదీ లేనిదీ నీకెలా తెలుసురా?

వాస్యా: అదేమో నాకు తెలీదు. కాని, మనం చాలా భాగ్యవంతులం అని మాత్రం తెలుసు. అంచేత నాన్నగారు ఎంతో కష్టపడి పనిచేసి వుండాలి. ఆయన కష్టపడి పనిచేస్తున్నారా లేదా?

భూస్వామి: పనిచెయ్యడమంటే, అన్నిపనులూ ఒకేరకంగా వుండవు. నేనుచేసేపని బహుశా మరొకరు చెయ్యలేక పోవచ్చు.

వాస్యా: మీరు చేసేపని ఏమిటి?

భూస్వామి: నీకు తిండి, బట్ట, విద్యాబుద్ధులు—అన్నీ అమరేలా చూడడమే నా పని.

వాస్యా: అయితే అతనుకూడా తన బిడ్డలకోసం ఈ పనే చెయ్యవచ్చుగా? అలాంటప్పుడు అతను అంత పేదవాడై పోవడానికి కారణం.........

భూస్వామి: [నవ్వుతూ] ఓ! అప్పుడే నీ వొక సోషలిష్టువు అయిపోయావన్నమాట!

భార్య: అవును. [ఏదో ఫ్రెంచిభాషలో అన్నది] ఒక మూర్ఖుడు వెయ్యిమంది పండితులు జవాబుచెప్పాల్సిన అవసరంవచ్చేలా ప్రశ్నలు వేయగలడు. కాని మనకు కావల్సింది 'ఒక మూర్ఖుడు' కాదు. 'ఒక పండితుడు'. ప్రతిబిడ్డా కూడా ఇలాంటివాడే. ఇది సత్యం!

# బాధించినవాళ్లను ప్రేమించుట

మాషా, 10 ఏండ్ల వయస్సు—వాన్యా, 8 ఏండ్ల వయస్సు

మాషా: మొన్నటిలాగా అమ్మ మనల్ని గుర్రపు బగ్గీలో కూచోపెట్టుకుని మళ్ళీ షికారుకు తీసుకువెడితే ఎంత బాగుంటుంది! నాకు మళ్ళీ వెళ్ళాలనివుంది. మరి నీకో? నీకు ఏమనిపిస్తోంది?

వాన్యా: నాకా? నిన్నటిలాగా జరిగితే బాగుండుననిపిస్తుంది.

మాషా: ఎందుకని? నిన్న మంచిపని ఏమీ జరగలేదే. గ్రిషా నిన్ను కొట్టాడు. తరువాత మీ ఇద్దరూ ఏడ్చారు. మళ్లీ అలాగే జరగాలని కోరుకుంటున్నావా?

వాన్యా: అవును. అందులోనే నాకు ఆనందంవుంది! మన స్ఫూర్తిగా ఇవాళకూడా అలాగే కావాలని నా కోరిక.

మాషా: ఏమిటో నీమాటలు? నా కర్థంకావడంలేదు.

వాన్యా: అయితే చెప్తాను విను. క్రిందటి ఆదివారం పావెల్ బాబాయి వచ్చాడు, గుర్తుందా? .........ఆయనంటే నీకిష్టమేనా?

మాషా: నాకు ఇష్టం లేకపోవడమేమిటి? చాలా ఇష్టం. ఆయన్ను అందరూ ప్రేమిస్తారు. ఆయన వేదాంతిఅట! అమ్మ చెప్పింది. అది అక్షరాలా నిజం.

వాన్యా: సరే......క్రిందటి ఆదివారంనాడు ఆయన ఒకకథ చెప్పాడు. ఎప్పుడో ఒకాయన వుండేవాడట. ఆయన్ను అందరూ అసహ్యించుకునేవారట. హింసించేవారట. కాని హింసించినకొద్దీ ఆయన అందరినీ ప్రేమించేవాడట. నీకు జ్ఞాపకంవుందా? అందరూ ఆయన్ను తిట్టేవారు. కాని

ఆయన అందరినీ పొగడేవాడు. వారు ఆయన్ను కొట్టే వారు. ఆయన వారికి సహాయంచేసేవాడు. అంచేత బాబాయి ఏమన్నాడనుకున్నావు? ఆయనలాగానే మనం ప్రవర్తిస్తే, మనకు ఎంతో ఆనందం కలుగుతుందని చెప్పాడు. ఆ కథ నాకు బాగా నచ్చింది. నేనూ ఆ కథలో ఆయనకుమల్లే వుండాలని కోరుకుంటున్నాను. అంచాత నిన్న గ్రిషా నన్ను కొట్టినప్పుడు, నేను అతన్ని ముద్దు పెట్టుకున్నాను. వాడు దుఃఖించాడు. అప్పుడు నాకు ఎంతో ఆనందం కలిగింది. కాని మన పనిమనిషివుంది చూచావా? ఆమెతో నేను వేగలేకుండావున్నాను. నన్ను ఆమె తిడుతుంది. అప్పుడు ఎలా నడుచుకోవా ల్సిందీ తెలీక నేను చాలా మొరటుగా ప్రవర్తిస్తున్నాను. ఇహ ఆవిడపట్లకూడా సరీగా నడుచుకోవాలి.

మాషా: అంటే ఎవరైనా నిన్ను కొట్టడం నీకు ఇష్టమా?

వాన్యా: అవును. చాలా ఇష్టం. నన్ను గ్రిషా కొట్టి నప్పుడు ఎలా ప్రవర్తించానో, అందరి ఎడల అలాగే ప్రవర్తించాలని వుంది. అది నా కెంతోహాయినిస్తుంది.

మాషా: ఛీ! నీ మాటలకు అర్థంలేదు! నీవు మొదటినుంచీ మూర్ఖుడివి. ఇప్పుడూ అంతే!

వాన్యా: అలాగే అనుకో. మరేం ఫరవాలేదు. ఏం చేస్తే ఆనందం కలుగుతుందో, నేను ఆపనే చేస్తాను.

మాషా: నీ వెంత అవివేకివి! నిజంగా నీవు అలా నడుచు కుంటే సుఖం కలుగుతుందా?

వాన్యా: ఆ! అమితమైన ఆనందం పొందుతాను.

# పత్రికలు

వోలోడ్యా, హైస్కూలువిద్యార్థి, 14 ఏండ్లవయస్సు.
సోన్యా, 15 ఏండ్ల వయస్సు. మిషా, 8 ఏండ్ల వయస్సు. ఒక కూలివాడు.

[వోలోడ్యా చదువుకుంటూ, హోమ్‌వర్కు చేసుకుంటూ ఉంటాడు. సోన్యా వ్రాసుకుంటూ ఉంటుంది. ఒక కూలివాడు వీపుమీద పెద్ద బరువు వేసుకుని, మిషాను వెంటతీసుకొని అక్కడికి వస్తాడు]

కూలివాడు: ఈ బరువు ఎక్కడ దించాలో చెప్పండి అయ్యగారూ! నా గూడలు పడిపోతున్నాయి.

వోలోడ్యా: ఎక్కడ పెట్టమని చెప్పారు నీకు?

కూలివాడు: ప్రస్తుతానికి చదువుకునే గదిలో పెట్టమని వాసిలీగారు చెప్పారు. పెద్దయ్యగారు వచ్చినతరువాత ఎక్కడో సర్దుకుంటారట.

వోలోడ్యా: అయితే సరే. ఆ మూల పడెయ్యి.

[చదువుకుంటూనే గదిలో మూలకు వెడతాడు]

[కూలివాడు బరువుదించి, అలుపుతీర్చుకుంటూ వుంటాడు.]

సోన్యా: అతను మోసుకువచ్చింది ఏమిటి?

వోలోడ్యా: 'సత్యం' అనే వార్తాపత్రిక.

సోన్యా: వార్తాపత్రికా? అమ్మో నాయనో! చాల పెద్దదే!

వోలోడ్యా: ఒకరోజుది కాదు. సంవత్సరం పత్రికలు అవి.

[చదువుకుంటూ వుంటాడు.]

మిషా: అదంతా మనుషులే వ్రాశారా!

కూలివాడు: అవును. ఎంతో వ్రాశారు. అదివ్రాసినవాళ్ళు నిజంగా ఎముకలు విరుచుకుని వుండాలి.

వోలోడ్యా: ఏమిటి నీవు అనేది?

కూలివాడు: అదంతా వ్రాసినవాళ్ళు ఎంతో కష్టపడి వుంటారని అన్నాను. సరే, అయ్యగారూ! నే వెడతాను. పత్రికలు ఇక్కడ పెట్టానని వారొస్తే చెప్పండి. [వెళ్ళిపోతాడు]

సోన్యా: [వొలోడ్యాతో] నాన్నగారి కా పత్రిక లెందుకో?

వొలోడ్యా: బోల్షికోవ్ వ్రాసిన వ్యాసాలు కత్తిరించుకోవాలని తెచ్చుకున్నారు.

సోన్యా: మరి బాబాయి ఆ వ్యాసాలు బాగుండవంటాడే?

వొలోడ్యా: అవును ఆయన 'వాస్తవం' అనే మరో పత్రిక చదువుతాడు.

మిషా: అయితే బాబాయి చదివే పత్రిక ఇంతకంటె పెద్దదా?

సోన్యా: పెద్దదే! కాని ఇదికూడా పెద్దదే. ఇప్పుడు మన గదిలో పెట్టిన పత్రికలు ఒక ఏడాదివి. ఈ పత్రిక ఇరవై ఏండ్లనుంచీ అచ్చుఅవుతోంది. కనుక ఈ ఇరవై ఏండ్లలో ఎన్ని పత్రికలు వచ్చివుంటాయో ఊహించుకో!

మిషా: ఏమిటీ? ఇలాంటి కట్టలు మరో ఇరవై వచ్చి వుంటాయన్నమాట!

సోన్యా: [మిషాకు ఇంకా ఆశ్చర్యం కలిగించాలని] ఇంకా చెప్తాను విను. ఇప్పుడు మనం రెండు పత్రికలను గురించి మాత్రమే మాట్లాడుకున్నాం. ఇలాంటి పత్రికలు సుమారు ముప్ఫయి ప్రచురింపబడుతున్నాయి.

వొలోడ్యా: [తలవొత్తుకుంటానే] ముప్ఫయ్యా! ఒక ముప్ఫయి ఏమిటి? ఒక్క రష్యాదేశంలోనే అయిదువందలముప్ఫై.

పత్రికలు వున్నాయి. ఆవిధంగా అన్ని దేశాలలోనూ అచ్చయ్యే పత్రికలను కలిపి లెక్క వేసుకుంటే—కొన్ని వేలు వుంటాయి.

మిషా: అవన్నీ మన గదిలో పడతాయా?

వాలోద్యా: మనగదిలోనా? నీమొహం! మన గదికాదు. ఆ పత్రికలన్నిటినీ పోగుచేస్తే మన వీధి అంతాకూడా సరిపోదు. సరే. ఇహ అనవసరమైనకబుర్లతో నా చదువు పాడుచెయ్యకు. నాకు రేపు పరీక్షవుంది. బోలెడుచదువుకోవాలి. [మళ్ళీ చదువుకుంటూ కూచుంటాడు.]

మిషా: ఆ వ్రాసేవాళ్ళు ఎవరో ఇన్ని పత్రికలనిండా, ఇంత చేటు వ్రాయడం అనవసరమని నాఉద్దేశ్యం.

సోన్యా: ఏం? ఎందుకువ్రాయకూడదు?

మిషా: ఎందుకనా? వాళ్లు వ్రాసేది సత్యమేకనుక అయినట్లయితే, ఆ సత్యాన్ని ఇంతగా పదేపదే వ్రాసిందే తిరిగి వ్రాయడం అనవసరం. ఒకవేళ ఆ వ్రాసేది సత్యంకాక అబద్ధమయినట్లయితే, అలాంటి అబద్ధాలువ్రాయాల్సిన అవసరం అసలేలేదు.

సోన్యా: అయితే అదన్నమాట నీ ఉద్దేశ్యం!

మిషా: అవును. లేకపోతే, ఇలా అంతులేనివ్రాతలుఎందుకూ వ్రాయడం?

వాలోద్యా: [చదవడం ఆపి, తలఎత్తిచూస్తాడు] ఎందుకంటే పత్రికలు స్వేచ్ఛగా తమభావాలు ప్రకటిస్తేగాని, మనకు అసలు నిజమేమిటో తెలీదు.

మిషా: మరి అయితే నాన్నగారు 'సత్యం' అనే పత్రికలో వ్రాసేదంతా వాస్తవం అని అంటున్నారు. బాబా యేమో, 'ఆపత్రిక సరియైనదికాదు, 'వాస్తవం'అనేపత్రికలో వ్రాసేదంతా నిజం' అంటున్నారు. కనుక అసలు నిజమనేది 'సత్యం' పత్రికలోవుందా? లేక 'వాస్తవం' పత్రికలో వుందా?

సోన్యా: అవును. వాడు అడిగేది అక్షరాలా నిజం! అనేక వార్తాపత్రికలు, వారపత్రికలు, పుస్తకాలు వున్నాయి. వీటిలో ఏది నిజాన్ని బోధిస్తుందో తెలీదు.

వాలోడ్యా: నీకేం తెలుసు? ఆడపిల్లవు. ఆడవాళ్ళంతా నిష్ప్రయోజనమైన మనుషులు!

సోన్యా: కాదు! ఆడవాళ్ళల్లో అనేకమంది ప్రయోజకులు వున్నారు. చెప్పడానికి నాకు చాతకావడంలేదుగాని...

వాలోడ్యా: అయితే అలాగే పత్రికలుకూడా. పత్రికలలో అనేకం మంచివీ వున్నాయి, కొన్ని చెడ్డవీ వున్నాయి. తమది నిజమని నిరూపించుకోవడానికి ఎవరికి తగిన కారణాలు వారికి వుండనేవున్నాయి.

మిషా: అయితే ఇంకేం? ఎవరికారణాలు వారికి వున్నప్పుడు ప్రతివారూ మంచో, చెడో తమకు తామే నిర్ణయించుకుంటారు. మరొకడితో పనిలేదు.

వాలోడ్యా: అవును. నీ పాండిత్యాన్ని గొప్పగా ప్రకటించావుగాని, ఇహ ఇక్కడ అల్లరిచేశారూఅంటే ఊరుకోను. మరోచోటుకు పోయి మీ ఇష్టంవచ్చినట్లు ఏడవండి. నేను చదువుకోవాలి.

# పశ్చాత్తాపం.

వొల్యా, 8 ఏండ్ల వయసు

ఫెద్యా, 10 ఏండ్ల వయసు

[వొల్యా నడవలో నిలబడివుంటాడు. అతని చేతిలో ఒక ఖాళీపళ్ళెం వుంటుంది. వెక్కి వెక్కి ఏడుస్తూ వుంటాడు. ఫెద్యా పరుగెత్తుకుంటూవచ్చి అతన్ని చూచి ఆగిపోతాడు]

ఫెద్యా: నీవు ఎక్కడవున్నావో అమ్మ చూచిరమ్మంది. ఎందుకూ నీవు ఏడుస్తున్నావు? అది తీసుకెళ్ళి దాసీ దానికి ఇచ్చావా?

[అతని చేతిలోవున్న ఖాళీపళ్ళెం చూచి కెవ్వున కేక వేస్తాడు] పళ్ళెంలో పెట్టిఇచ్చిన ఫలహారం ఏమైంది?

వొల్యా: నేను... నేను... నేను... అకస్మాత్తుగా... ...ఓ, ఓ, ఓ... ...ఏం చెప్పను ? తినేశాను... ...

ఫెద్యా: దాసీకి ఇవ్వమంటే ఇవ్వకుండా నీవు తినేశావా? భలేపనిచేశావు! నీవు ఇంకా దాన్ని తీసుకెళ్ళి ఇచ్చావని అమ్మ అనుకుంటోంది.

వొల్యా: అవును. ఇవ్వాలనుకున్నాను... కాని... ...కాని అనుకోకుండానే అకస్మాత్తుగా... ...ఓ, ఓ, ఓ! ఎలా చెప్పాలో చాతకావడంలేదు!... ...

ఫెద్యా: నా కర్థమైందిలే! ఎలా వుంటుందో అని ముందు కాస్త రుచి చూచావు. ఆ తరువాత అంతా తినేశావు. భలేపనిచేశావు. [నవ్వుతాడు]

వోల్యా: నవ్వు, నవ్వు! నేను ఏడుస్తూవుంటే నీ కేమో నవ్వులాటగావుందా? నే నిప్పుడు వాళ్ళ కేమనిచెప్పను? దాసీ దగ్గరకు పోవడానికి వీల్లేదు; అమ్మవద్దకు పోవడానికి అంతకన్నా వీల్లేదు...

ఫెడ్యా: భలేపనిచేశావు......పళ్ళెండు ఫలహారం మింగేసి కూచున్నావు...అహ్హా, హ్హా హా! ఇహ ఏడ్చి ఏంలాభం? ఇప్పుడు చేయాల్సింది ఏమిటో ఆలోచించు.

వోల్యా: ఏం ఆలోచించేది? ఏం చేసేది?

ఫెడ్యా: ఎంత చిక్కులోపడ్డదిరా వ్యవహారం!

[వచ్చేనవ్వును ఆపుకుంటూ ఒక క్షణం మౌనంగా వుంటాడు]

వోల్యా: ఇప్పు డేంచేయాలి? నాకు భయంవేస్తోంది:

[ఏడుస్తాడు]

ఫెడ్యా: ఎందుకూ ఏడుస్తావు? ఊరుకో. వెళ్ళి అమ్మతో జరిగిన సంగతి చెప్పు.

వోల్యా: అమ్మో! అమ్మతో చెప్పడమే! పట్టుకుని చెమడాలువత్తుతుంది.

ఫెడ్యా: అయితే వెళ్ళి దాసితో ఇలా చేశానని చెప్పు.

వోల్యా: ఊహు! ఎలాచెప్పను? ఏమని చెప్పను?

ఫెడ్యా: అయితే నీ విక్కడే వుండు. నేను పరుగెత్తుకెళ్ళి దాసీదానితో జరిగిన సంగతి చెప్పేస్తాను. ఆమె ఏమీ అనుకోదులే.

వోల్యా: వద్దు. ఆమెతో నీ వేమీ చెప్పొద్దు. నేను...... నే నెలా చెప్పను?

ఫెడ్యా: ఛీ! ఏమిటి నీ గోల? తప్పుడుపని చేశావు. పైగా చెప్పవద్దంటావేం? నే వెళ్ళి చెపుతాను. [పరుగెత్తుతాడు]

వొల్యా: ఫెడ్యా! ఫెడ్యా! ఆగు!...ఓ! పోనే పోయాడే... ఊరకే రుచిచూద్దామనుకున్నాను...కాని గుర్తులేదు... అంతా తినేశాను! ఏం చేయను?... [ఏడుస్తాడు]
[ఫెడ్యా మళ్ళీ పరుగెత్తుకుంటూ వస్తాడు]

ఫెడ్యా: ఇప్పటివరకూ ఏడ్చింది చాలు! ఇహ ఏడవకు. నే చెప్పలా దాసి ఏమీ అనదని. 'పోనీ, పాపం, పసివాడు తింటే తిన్నాడులే' అంది ఆమె.

వొల్యా: అయితే ఆమెకు కోపంరాలా?

ఫెడ్యా: కొంచెమైనా కోప్పళ్ళేదు. 'పోతేపోనీలే, ముష్టిఫలహారం! పసివాడు తిన్నాడు. నన్నడిగితే ఇంకా కొంచెం తెచ్చిపెట్టేదాన్నిగా' అంది ఆమె.

వొల్యా: మరి నే నలా చెయ్యాలని చేయలేదు.
(మళ్ళీ ఏడవడం మొదలెడతాడు.)

ఫెడ్యా: మళ్ళీ ఎందుకు ఏడుస్తావు? ఈ సంగతి అమ్మతో చెప్పంలే. దాసీదేమో, నిన్ను క్షమించిందాయె. ఇంకేం?

వొల్యా: అవును. దాసి నన్ను క్షమించింది. ఆమె చాలా దయగలది, మంచిది. మరి నేను? నేను చాలా చెడ్డవాణ్ణి, చెడ్డవాణ్ణి, చెడ్డవాణ్ణి! ఆ చెడుబుద్ధే నన్ను ఏడిపించింది.

## క్రి ౯

ఒక నౌకరు. ఒక దాసి. పావెల్—వంటవాడు.

నటాషా, ౮ ఏండ్ల బాలిక. నైనా, హైస్కూలు విద్యార్థిని.

సెనీచ్ కా, హైస్కూలులో చదివే బాలుడు.

నౌకరు: [ఒక పళ్ళెంలో వస్తువులు పెట్టుకుని తీసుకొస్తాడు.] బాదంపాలు, టీ, రమ్!

దాసి: [మేజోళ్ళు కుట్టుతూ, ఎన్నికుట్లు వేసిందీ లెక్క పెట్టుతుంది.] ... ఇరవై రెండు, ఇరవై మూడు ...

నౌకరు: వాసిలెవ్ నా, వాసిలెవ్ నా!

దాసి: ఎందుకలా అరుస్తావు? వినపడుతూనేఉంది. ఉండుండు. పనిచేస్తూ మధ్యలో ఎలా ఆపుచేయడం? [నటాషాతో] చిట్టితల్లీ! ఇంకోనిమిషంలో ద్రాక్షపండ్లు వస్తాయి, తిందువుగాని. ముందు ఈ పాలు ఇవ్వనా? [అంటూ నౌకరు తెచ్చిన పాలు తీసుకుని ఆరబోస్తుంది.]

నౌకరు: [క్రింద కూలబడతాడు.] నేను ఇలాంటివి చాలా చూచాను. వాళ్ళకు ఎంత డబ్బిస్తారు?

దాసి: ఏమిటి నీవు చెప్పేది? వాళ్ళు నాటకానికి వెళ్ళారా యేం? ఇవాళ నాటకం చాలా పెద్దదిలా వుంది.

నౌకరు: అవును. పెద్దనాటకం. వాళ్ళువెళ్ళి చాలసేపయింది. నీవు ఇక్కడే కుట్టుకుంటూ కూచోవడంవల్ల ఎంతసేపయిందీ తెలీలేదు... ఈ నాటకాలు చూస్తుంటే నాకు బహు చిత్రంగా వుంటాయి!

[అంతలో వంటవాడు పావెల్ ద్రాక్షపండ్లు తీసుకొస్తాడు. ఏం మాట్లాడుతున్నారో విందామని కొంచెం ఎడంగా నిలబడతాడు]

దాసి: అయితే, నాటకంలో పాటలుకూడా ఉన్నాయా?

నౌకరు: ఆ. ఉన్నాయి. కాని ఏంపాటలు? ఊరకే గొంతులు చించుకుంటూ అరవడం, కేకలు వెయ్యడం తప్ప నాకు మరేం కనిపించలేదు. అంతేకాదు. మధ్యలో ఒకరితో ఒకరు తగాదాడుకుంటారు. మళ్ళీ పాడటం ప్రారంభిస్తారు.

దాసి: నాటకానికి సీజన్ టిక్కెట్టు తీసుకుంటే చాలాడబ్బు అవుతుందని చెపుతారే?

నౌకరు: అవును. మన అయ్యగారు మొదటితరగతిసోఫాలో కూచుంటారు. పన్నెండునాటకాలకూ కలిపి టిక్కెట్టు మూడువందల రూబుల్సు అట!

పావెల్: (తల ఊపుతూ) మూడువందల రూబుల్సే! ఆ డబ్బంతా ఎవరికి పోతుంది?

నౌకరు: ఎవరికేముంది? పాటగత్తెలకే ఎక్కువ భాగం చెందుతుంది. ఒక్కొక్క పాటకురాలు ఏడాదికి యాభై వేల రూబుల్సు సంపాయిస్తుందని చెపుతున్నారు.

పావెల్: మరి మనఅయ్యగారు ఆనాటకాలు చూడ్డానికి ఏడాదికి మూడొందల రూబుల్సు ఖర్చుపెడుతున్నారన్నమాట. అమ్మో, ఎంతడబ్బు! మనం ప్రొద్దస్తమానం రెక్కలు విరుచుకుంటే, పొట్టగడుపుకుని ఆఖరుకు వంద రూబుల్సుకూడా మిగుల్చుకోలేకుండా ఏడుస్తున్నాం. మహారాజులు అంతంతడబ్బు ఈ పాడునాటకాలకోసం వెదజల్లుతున్నారు. [నైనా అక్కడికి వస్తుంది]

నైనా: నటాషా ఇక్కడ వుందా? ఓ! నీవు ఇక్కడే వున్నావటే? అమ్మ రమ్మంటోంది.

నటాషా: [ద్రాక్షపండ్లు తింటూ]ఒక నిముషంలో వస్తా.

నైనా: [వంటవాడితో] ఏమిటది? వందరూబుల్సు అంటున్నారు.

దాసి: మనసిమన్ [నౌకరును చూపిస్తూ] నాటకాలలో పాటగత్తెలకు ఎంతెంత డబ్బిస్తున్నదీ మొదలైన సంగతులు చెప్తున్నాడు. అది విని మన పావెల్ [వంటవాణ్ణి చూపుతూ] ఆశ్చర్యపోతున్నాడు. ఏం నైనా? నీవు చెప్పు ఒక్కో పాటకత్తెకు పాతిక వేల. రూబుల్సు వస్తాయట. నిజమేనా?

నైనా: పాతిక వేలేం కర్మ! ఇంకా ఎక్కువే వస్తాయి. ఒక గాయకురాలికి నూటయాభై వేల రూబుల్సు ఇస్తామనీ, అమెరికా రావల్సిందనీ ఆహ్వానించారు. అంతేకాదు. నిన్న వార్తాపత్రికలో మరో విచిత్రమైన విషయంవుంది. ఒక గాయకుడికి తన వ్రేలిగోరుకోసమని ఇరవై అయిదు వేలరూబుల్సు తీసుకున్నాడు

పావెల్: వట్టిది. ఈ పత్రికల్లోవార్తలు నమ్మేదెవరు? వాళ్ళు ఇలాంటి చెత్త, చెదారం అంతా అచ్చువేస్తుంటారు.

నైనా: [ఉత్సాహంతో]కాదు. ఇది నిజం! నామాటనమ్మ.

పావెల్: మరి అయితే ఒక ముష్టిగోరుకోసమని అంత డబ్బిస్తారా?

నటాషా: అవును. అబద్ధం!

నైనా: ఎందుకిచ్చారో చెప్తాను వినండి. అతను పియానో వాయిస్తాడు. అతను తన చెయ్యిని భీమాచేయించు

కున్నాడు. అతనిచేతికి ఏదైనా ప్రమాదం సంభవించి పియానో వాయించలేకపోతే, నష్టపరిహారంగా భీమా కంపెనీవాళ్ళు సొమ్ము ఇవ్వాలి. అంచేతనే అతనికి అంత డబ్బు వచ్చింది.

పావెల్: భలే వ్యాపారం!

[ఆరోభారంచదివే హైస్కూలువిద్యార్థి సెనీచ్కా ప్రవేశిస్తాడు.]

సెనీచ్కా: ఏమిటీ? ఇక్కడ అంతా సమావేశమై ఏదో చర్చిస్తున్నారు. ఏమిటి సంగతి?

[నైనా అతనితో విషయమంతా చెపుతుంది]

సెనీచ్కా: [ఇంకా ఉత్సాహంతో] నాకు ఇంతకన్నా విచిత్రమైనసంగతి మరొకటి తెలుసు! పారిస్ నగరంలో ఒకనర్తకి తన రెండు కాళ్ళను, రెండువందలవేల రూబుల్సుకు భీమాచెయించుకుంది. ఆమెకాళ్ళకు ఎలాంటి ప్రమాదం సంభవించినా, నృత్యంచేయడానికి వీలులేకపోయినా, అంత డబ్బూ భీమాకంపెనీవాళ్ళు ఆవిడకు చెల్లించాల్సిందే!

నౌకరు: మీ కెవరికీ కోపంరాకుండావుంటే ఒకమాట చెపుతాను. నిజానికి వారు చేసేపని మరొకరు చేయగలరా? వాళ్ళు నృత్యంచేస్తోంటే, ఆ శరీరాల్లోఎముకలులేవేమో అనిపిస్తుంది.

పావెల్: వారిని నీవు పొగడాల్సిందే. హుఁ! అదీ ఒక పనేనా?

సెనీచ్కా: అలా అనకూడదు. మనం ఒక విషయం గమ

నించాలి. వారు చేసేపని ప్రతివారూ చేయడం సాధ్యం కాదు. సంగీతం, నాట్యం; ఇవి నేర్చుకోవాలంటే ఎన్ని సంవత్సరాలు పట్టుతుందో ఆలోచించండి.

పావెల్: నేర్చుకోవడమా? ఏమిటినేర్చుకునేది? రెండుకాళ్లూ అడ్డదిడ్డంగావేసి గిరగిరా తిప్పడం, అదీ ఒక విద్యేనా? ఏదైనా మంచిపని నేర్చుకోవాలిగాని.

సెనీచ్కా: ఓ! నీకేమీ అర్థంకాదు. 'కళ' అనేది చాలా గొప్పది.

పావెల్: మీకు అంతే కావచ్చు. నా దృష్టిలో అదంతా చెత్త! పనికిరాని వ్యవహారం! వళ్లుబలిసిన ప్రజలు తమ దగ్గరున్న పాడుసొమ్ము అవతల పారేసి, ఇలాంటివన్నీ చూచి ఆనందిస్తుంటారు. మాలాగానే వాళ్ళూ కష్టపడి సంపాయించినట్లయితే సొమ్ము విలువ తెలిసేది. అప్పుడు ఇలాంటి చెత్తరకం నర్తకులు, పాటకులు ఉండేవారే కాదు. ఇలాంటివారిని అందరినీ కలిపినా ఒక ఫార్తింగు విలువచెయ్యరు.

సెనీచ్కా: అవును. నీవు చదువురాని మొద్దువు అవటంచేత అలా అభిప్రాయపడుతున్నావు! చదువుకోని నీబోటి అజ్ఞానులందరికీ గొప్పగొప్ప విషయాలు అతి స్వల్పమైన విగా అగుపిస్తాయి. అవన్నీ నీవు చెత్త, చెదారం అని తోసేస్తావు.

నటాషా: పావెల్ చెప్పింది ముమ్మాటికీ నిజం. నేను అతని అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను.

నైనా: సరే. ఇహ రాండి, వెడదాం!

# విజ్ఞానం

ఒక విద్యార్థి వయస్సు 15. స్కూలులో నవీనభావాలు కలవాడు.
రెండో విద్యార్థి వయస్సు 16. స్కూలులో ప్రాచీనభావాలు కలవాడు.
వోలోడ్యా, పెట్రూషా 8 ఏండ్ల కవలపిల్లలు.

నవీనభావాలుకలవిద్యార్థి: గ్రీకు, లాటిన్ భాషలవల్ల నాకేమీ ఉపయోగం కనిపించడంలేదు. వాటిని నవీన భాషల్లోకి తర్జుమాచేస్తే తప్ప, లేకపోతే ప్రయోజనం లేదు.

ప్రాచీనభావాలుకలవిద్యార్థి: కాదు. నీవు 'ఇలియడ్'ను గ్రీకులో చదివితేతప్ప, దాన్ని అర్థంచేసుకోలేవు.

నవీన–విద్యార్థి: నాకసలు ఆ పుస్తకం చదవాల్సిన అవసరం లేదు. చదవనుకూడాను.

ప్రాచీన – విద్యార్థి: 'ఇలియడ్' ఏమిటో తెలుసా?

నవీన – విద్యార్థి: తెలుసు. అదొకకథ.

ప్రాచీన – విద్యార్థి: అవును. ఆ కథలాంటి కథ మరొకటి లోకంలో లేదు.

పెట్రూషా: అది ఎందువల్ల అంత మంచికథేమిటి?

నవీన – విద్యార్థి: అదేం మంచికథకాదు. తక్కిన కథలు లాంటిదే అదికూడాను.

ప్రాచీన – విద్యార్థి: నీవు ఆ కథలు చదవందే పూర్వ కాలాన్ని అర్థంచేసుకోలేవు.

నవీన - విద్యార్థి: అది కేవలం మూఢనమ్మకమని నా అభి ప్రాయం. వేదాంతం మాదిరే అదికూడాను.

ప్రాచీన - విద్యార్థి: [కోపంవస్తుంది] వేదాంతం అబద్ధమనీ, అర్థంలేనిదనీ అంటున్నావు. కాని వేదాంతం చరిత్ర చెప్పిన సత్యమనీ, మానవుడి వివేకమనీ గ్రహించుకో!

వాలోడ్యా: అయితే నిజంగా వేదాంతం వట్టిదేనా?

ప్రాచీన - విద్యార్థి: నీ వెందుకూ మధ్యలో మాట్లాడుతావు? నీవు ఇలాంటి విషయాలు అసలు అర్థంచేసుకోలేవు.

వాలోడ్యా, పెట్రూషా: [ఇద్దరూకలిసి ఒకేసారి] ఏం? ఎందుకు అర్థంచేసుకోలేం?

వాలోడ్యా: [ఒక్కడూ మళ్ళీ] మీ కంటె మేమే బాగా అర్థంచేసుకోగలం!

ప్రాచీన - విద్యార్థి: సరే సరే! అరవకుండా చూచోండి. మా సంభాషణకు అడ్డురాకండి. [నవీన - విద్యార్థితో] ప్రాచీన భాషలు ఈనాటి కొత్తజీవితానికి అన్వయించవని నీ ఉద్దేశ్యం. మరి అయితే జీవశాస్త్రం, రసాయనిక శాస్త్రం, పదార్థవిజ్ఞానశాస్త్రం, ఖగోళశాస్త్రం; వీటి విషయంలోకూడా అదేమాట చెప్పవచ్చుగా! గ్రహాలు, నక్షత్రాలు, వాటిగమనాలు, ఆకారాలు, అంతరాలు; ఈ వివరాలన్నీ తెలుసుకున్నందువల్ల ఎవరి కేం ప్రయోజనం?

నవీన - విద్యార్థి: ఎందుకులేదూ? అలాంటిజ్ఞానం సంపాదించినందువల్ల ఎంతో ఉపయోగం వుంది.

ప్రాచీన - విద్యార్థి: ఏమిటి ఆ ఉపయోగం?

నవీన - విద్యార్థి: ఒక టేమిటి? అన్ని పనులకూ— ఉదాహరణకు ఓడప్రయాణంలో ఎంతో ఉపయోగిస్తుంది.

ప్రాచీన-విద్యార్థి: ఓడప్రయాణంకోసం ఖగోళశాస్త్రం అవసరంలేదే.!

నవీన - విద్యార్థి: ఎందుకు లేదూ? సైన్సును వ్యవసాయానికీ, వైద్యానికీ, పరిశ్రమలకూ అన్వయింపజేసి, ఎన్నో ప్రయోజనాలు సాధించడం మనం ప్రత్యక్షంగా చూస్తున్నాం...

ప్రాచీన - విద్యార్థి: అయితే అదేవిజ్ఞానాన్ని ఉపయోగించి బాంబులు, మందుగుండు సామగ్రికూడా తయారు చేయవచ్చు. యుద్ధాలలోనూ, విప్లవాలలోనూ ప్రయోగించవచ్చు. దీనివల్ల మానవులజీవితం సౌఖ్యవంతం అవుతుందంటావా? ... ...

నవీన - విద్యార్థి: అయితే నీవుచెప్పే విజ్ఞానంవల్లనే ప్రజలు సుఖంగా జీవిస్తారా?

వాలోడ్యా: ఇంతకూ ఎలాంటి విజ్ఞానంవల్ల మానవులకు మంచి జరుగుతుంది?

ప్రాచీన.- విద్యార్థి: ఇంతకుముందే చెప్పాను, నీకంటే పెద్దవాళ్ళు మాట్లాడుకునేటప్పుడు మధ్యలో జోక్యం కల్గించుకోవద్దని. మీ పసివాళ్ళకు వెర్రిగా వాగడంతప్ప మరేం తెలీదు.

వోలోడ్యా, పెట్రూషా: [ఇద్దరూ ఏకమై] వెర్రివాగుడో మరేమన్నానో? ఇంతకూ ఎలాంటి విజ్ఞానం మానవులకు సుఖం కలిగిస్తుంది? ఆ విషయం చెప్పండురూ!

నవీన - విద్యార్థి: అసలు అలాంటి విజ్ఞానం లేనేలేదు. ప్రతివాడూ తన బ్రతుకు తనే సుఖంగా మార్చుకుంటాడు. అంతే!

ప్రాచీన - విద్యార్థి. నీవెందుకోయ్ ఆ పసిపిల్లలకు జవాబు చెపుతావు? వాళ్ళకేం తెలీదు.

నవీన - విద్యార్థి: ఎందుకు చెప్పకూడదూ? [వోలోడ్యా, పెట్రూషాలతో] మానవజీవితం బాగుపడడానికి కావల్సిన విజ్ఞానం హైస్కూళ్ళలో బోధించరు.

వోలోడ్యా: అదిబోధించకపోతే, ఇహమానం చదువుకోవాల్సిన అవసరమే లేదు.

పెట్రూషా: మేం పెద్దవాళ్ళం అయినతరువాత, అనవసరమైన విషయాలు నేర్చుకోం.

వోలోడ్యా: కాని, మా జీవితాలను మేమే బాగుచేసుకుని హాయిగా జీవిస్తాం.

ప్రాచీన - విద్యార్థి: [నవ్వుతూ] చూడు! ఈ పండితులు విషయమంతా కలగాపులగంచేసి ఎలా మాట్లాడుతున్నారో!

# కోర్టులో వ్యాజ్యం

ఒక రైతు, అతనిభార్య, అతని స్నేహితుడు.
ఫెడ్యా, పెట్కా—రైతుకొడుకులు.

రైతు: [ఇంట్లోకివచ్చి తన దగ్గరున్న వస్తువులన్నీ అవతల పెడతాడు] అరి దేవుడా! ఏం గాలి, ఏం గాలి! అంతదూరం పోయి వచ్చేసరికి నా ప్రాణంమీదికొచ్చింది.

భార్య: అవును. చాలా దూరం. ఇరవైమైళ్ళకు తక్కువ వుండదు.

రైతు: ఇరవైకాదు. ఖచ్చితంగా ముప్ఫయి మైళ్ళుంది. [ఫెడ్యాతో] వెళ్ళి ఆ గుర్రాన్ని లోపలికితోలు బాబూ!

భార్య: సరే, ఇంతకూ మనపక్షం చేశారా?

రైతు: ఏంపక్షమోనే, దానిపాడుగాను! బుద్ధితక్కువై ఇందులో ఇరుక్కున్నాం.

స్నేహితుడు: ఏమిటోయ్ నీవుచెప్పేది? నాకేమీ అర్థం కావడంలేదు.

రైతు: ఏముంది? అవర్యాన్ నా దొడ్డిని తనదొడ్లో కలుపుకున్నాడు. పైగా అది అంతా తనదేనని చెప్తున్నాడు. ఈ పేచీ ఎంతకూ తెగకుండావచ్చింది.

భార్య: అందుకని కోర్టుకువెళ్ళాం. కోర్టులో రెండేళ్ళబట్టీ ఈ వ్యాజ్యం నలుగుతూవుంది.

స్నేహితుడు: ఓ! అదా! ఆ విషయం నేనూ ఎరుగుదునులే. ముందు మనఊరి కోర్టులో విచారణ జరిగిందిగా. నీ పక్షమే తీర్పు చెప్పారని విన్నానే.

రైతు: అవును. ఆ తరువాత అవర్యాన్ తాలూకా కోర్టుకు వెళ్ళాడు. అక్కడకూడా నా పక్షమే అయింది. కాని మళ్ళీ ఒక చిక్కువచ్చిపడింది. జడ్జీలు విచారణచేసి ముందు నా పక్షమే తీర్పుచెప్పారు. తిరిగి ఇవాళ ఆ స్థలం అతనికే చెందాలని అంటున్నారు. మరి అదేమిటో! ఒక సారి నాదనీ, మరోసారి అతనిదనీ చెప్తున్నారు. మనకి జడ్జీలు భలేవాళ్ళు దొరికారు!

భార్య: అయితే ఇప్పుడు ఇంతకూ ఏంచేయాలి?

రైతు: నా ఆస్తిని అన్యాయంగా అతను ఆక్రమించుకుంటే నేను ఊరుకోను. ఆవిషయం పైకోర్టులోఫిర్యాదుచేస్తాను. అప్పుడే ఈవిషయం ప్లీడరుతో సంప్రదించానుకూడా.

స్నేహితుడు: మరి పైకోర్టులోకూడా అతనిపక్షమే అయితే?

రైతు: అప్పుడు ఇంకా పైకోర్టుకు వెడతాను. ఆదుర్మార్గుణ్ణి ఊరికే వదిలిపెడతానా? నాకువున్న చివరి ఆవుదూడను కూడా అమ్మి వ్యాజ్యంఆడతాను. వాడికి బుద్ధివచ్చేలా చెయ్యాలి.

స్నేహితుడు: మనపాలిట ఈ జడ్జీలు ఎక్కడ దొరికారురా భగవంతుడా! సరే. ఆ పైకోర్టులోకూడా అతనికే అనుకూలం అవుతుందనుకుందాం. అప్పుడూ?

రైతు: అప్పుడు ఏకంగా జార్ చక్రవర్తిదగ్గరకే వెడతాను... సరే—ముందు గుర్రానికి దాణావెయ్యాలి. [వెడతాడు]

పెట్కా: జార్ చక్రవర్తికూడా మనకు వ్యతిరేకం చేస్తే, అప్పుడు ఎవరిదగ్గరకు పోవాలి?

భార్య: జార్ చక్రవర్తికి పైన మరెవరూ లేరు.

ఫెడ్యా: అయితే, మరి, కొందరు అవగ్యాన్‌కు అనుకూలం చేశారు. మరికొందరు నాన్నగారికి అనుకూలంచేశారు. ఎందు కిలా చేశారు?

భార్య: ఎందుకంటే, అసలు న్యాయంగా ఎవరిపక్షం తీర్పు చెప్పాలో వాళ్ళకే తెలీదు.

పెట్యా: అలాంటి తెలీనివాళ్ళదగ్గరికి పోయి మనం తీర్పు చెప్పమని అడగడందేనికి?

భార్య: ఎవరైనా తమ ఆస్తిని పోగొట్టుకోగలరా? అందుకే తీర్పుచెప్పమని జడ్జీలదగ్గరికి వెడతారు.

పెట్యా: నేను పెద్దవాణ్ణి అయింతరవాత అలాచెయ్యను. ఏ విషయంలోనైనా, ఎవరితోనైనా నాకు పేచీవస్తే గుంపులు గుంపులు జనాన్ని పిలుస్తాను. ఎవరిపక్షానికి చెందాలో న్యాయం చెప్పమని అడుగుతాను. వాళ్ళు చెప్పినప్రకారం నడుచుకుంటాను. దాంతో ఆవ్యవహారం ఫయిసలా అయిపోతుంది. నేను 'అకుల్కా'తో పేచీ పడ్డప్పుడల్లా అలాగే చేస్తుంటాను.

స్నేహితుడు: బహుశా అది చాలా మంచిమార్గమని తోస్తోంది! ఎలాంటి పాపం లేకుండా తగువు పరిష్కార మైపోతుంది.

భార్య: అవును. మేం అలాచెయ్యకుండా, ఈ కోర్టుకువెళ్లాం. కోలుపోయాం! కాస్తంత జాగాకోసం డబ్బంతా తగ లేశాం. అసలు అది చేసే ఖరీదుకంటె మేం పెట్టినడబ్బే ఎక్కువ! ఓ! పాపంలో పడ్డాం—మహాపాపం!

# అపరాధికి శిక్ష

గ్రిషా, 12 ఏండ్లవయస్సు
శంకా, 10 ఏండ్లవయస్సు
టిషా, 13 ఏండ్లవయస్సు

టిషా: అతన్ని జైల్లో పెడతారు. మళ్ళీ ఎన్నటికీ ధాన్యపు కొట్లల్లో దొంగతనం చేయకుండా బుద్ధివచ్చేలా చేస్తారు. ఇహ రెండోసారి ఆపని చెయ్యాలంటే భయపడతాడు.

శంకా: నిజంగా అతను దొంగతనం చేసివున్నట్లయితే శిక్షార్హుడే. కాని మాతాతయ్య ఒకసారిచెప్పాడు—ఏమీ తప్పు చేయకపోయినా, అన్యాయంగా 'మిత్రోఫాన్'ను జైల్లో పెట్టారట.

టిషా: అన్యాయంగా'— అంటే ఏమిటి నీఉద్దేశ్యం? అతన్ని అన్యాయంగా జైల్లోపెడితే, ఆ జైల్లో పెట్టిన వాణ్ణికూడా శిక్షిస్తారు. నీకా సంగతి తెలుసునో లేదో?

గ్రిషా: అవును. అలా అక్రమమైన పనిచేసినవాణ్ణి ముద్దు పెట్టుకోరు. అతన్నికూడా శిక్షించితీరుతారు.

శంకా: అయితే, అతన్ని ఎవరు శిక్షిస్తారు?

టిషా: అతని పైవాళ్ళు.

శంకా: పైవాళ్ళు అంటే ఎవరు?

టిషాక్: అంటే అతనిపైనవుండే అధికార్లు.

శంకా: ఆ అధికార్లుకూడా తప్పుచేస్తే? అప్పుడో?

గ్రీషాక్: అప్పుడు ఇంకా పైనవుండే అధికార్లు వాళ్ళను శిక్షిస్తారు. అందుకనే అందరిపైనా జార్ చక్రవర్తి వున్నాడు.

శంకా: జార్ చక్రవర్తి కూడా తప్పుచేస్తాడనుకుందాం. అప్పుడతన్ని ఎవరు శిక్షిస్తారు?

టిషాక్: ఎవరు శిక్షిస్తారు? ఎవరు రక్షిస్తారు? మనకు తెలియడం... ...

గ్రీషాక్: అతన్ని దేవుడు శిక్షిస్తాడు.

శంకా: అయితే అప్పుడు, ఈ ధాన్యపుకొట్లో దూరినవాణ్ణి కూడా నిశ్చయంగా దేవుడే శిక్షిస్తాడు కదూ? కనుక ఎవరు ఏ తప్పుచేసినా శిక్షించేవాడు ఈశ్వరుడొక్కడే! ఆయన తప్పుచేయడు.

టిషాక్: కాని అలా ఎన్నటికీ జరగదు.

శంకా: ఏం? ఎందుకు జరగదూ?

టిషాక్: ఎందుకంటే, ...ఎందుకంటే. ...ఏమో!. ... ... ...

# స్వంత ఆస్తి

ఒక ముసలి వడ్రంగి. ఒక బాలుడు—7 ఏండ్ల వయస్సు.

[వడ్రంగి ఒక భవనంముందు వసారాలో కొయ్యపని చేస్తున్నాడు. వసారా వేయడానికి అవసరమైన చక్కలన్నీ బిగిస్తున్నాడు. ఆ గృహయజమాని కొడుకు అక్కడ కూచుని వడ్రంగిచేస్తున్నపనిని పరిశీలిస్తూ, అతని పనికి మెచ్చుకుంటున్నాడు.]

బాలుడు: నీవు చేసేపని ఎంతచక్కగావుంది! నీ పేరేమిటి?

వడ్రంగి: నా పేరు కోల్కా. కాని అందరూ ఇప్పుడు కోల్ అని పిలుస్తున్నారు. నాకు సావిచ్ అనే మరో పేరుకూడా వుంది.

బాలుడు: కోల్సావిచ్! నీవు చాలాచక్కగా పనిచేస్తావు.

వడ్రంగి: చేసేపనిలో వయ్యారం ఎందుకు బాబూ! ఏ పని చేసినా వళ్ళువంచి చెయ్యాలి. సరిగా పనిచేయకపోతే సంతోషం కలుగదు బాబూ!

బాలుడు: మీఇంటికి కూడా ఇలాంటి వసారా వుందా?

వడ్రంగి: [నవ్వుతూ] వసారా! అబ్బాయిగారూ! మీరెంత వెర్రిమారాజులండీ! మీ వసారాతో—నా ఇంటిని పోలుస్తున్నారా? కిటికీలేదు, తలుపులేదు, పైకప్పులేదు, గోడలులేవు; అదీ నా వసారా!

బాలుడు: నీవెప్పుడూ హాస్యాలాడి నవ్విస్తూవుంటావు. నిజం చెప్పు. నీకు ఇలాంటివసారా వుందాలేదా? నాకు తెలుసుకోవాలనివుంది.

వడ్రంగి: చిన్నబాబుగారూ! ఏంచెప్పను? మీభవనంలాంటి భవనాలు, వసారాలు మాకు ఎక్కడనుంచి వస్తాయి? తలదాచుకోడానికి కాస్తంత నీడవున్నా మా కదే పది వేలు. నేను ఇప్పటికి ఆరునెలలబట్టీ ఒక చిన్న పూరిల్లు వేసుకోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నాను. పాతఇల్లు పడిపోయింది. ఇంతవరకూ కొత్తది వేసుకోవడానికి కుదరలేదు. ఆ పాత సామానుకూడా చెదలుపట్టి పాడయి పోతోంది.

బాలుడు: [ఆశ్చర్యంతో] ఎందుకలాజరిగింది?

వడ్రంగి: ఎందుకేముంది? ఇల్లు కట్టుకోవడానికి నాకు తగినంత శక్తిలేదు.

బాలుడు: 'తగినంత శక్తి' అంటే ఏమిటి అర్థం? నీవు మా కోసం ఇక్కడ ఇంత పెద్దపని చేస్తున్నావుకదా! చేయడం లేదూ?

వడ్రంగి: అవును చేస్తున్నాను. నేను మీకోసం పని చేయగలనుగాని, నాకోసం చేసుకోలేను.

బాలుడు: ఎందుకు చేసుకోలేవు? నాకు అర్థంకావడంలేదే! దయచేసి విపులంగా అర్థమయ్యేలా చెపుదూ?

వడ్రంగి: మీరుపెరిగి పెద్దవారయింతరువాత అర్థంచేసుకుంటారు బాబుగారూ. నేను మీకోసం ఎంతపనిఅయినా చేయగలను. నాకోసం మాత్రం చేసుకోలేను.

బాలుడు: అదే ఎందువల్లఅని అడుగుతున్నా?

వడ్రంగి: ఎందుకంటే ఇల్లుకట్టుకోవడానికి నాకు కలపకావాలి అది నాదగ్గరలేదు. ఎక్కడైనా కొనుక్కోవాలి. అలా కొనుక్కోవడానికి నా దగ్గర డబ్బులేదు. ఇప్పుడు నేను మీకు పనిచేసిపెడుతున్నాను. నాపనికి మీ అమ్మగారు కూలిడబ్బులు ఇస్తారు. ఆ ఇచ్చేకూలి ఇంకాకాస్త ఎక్కువ ఇవ్వమని మీ అమ్మగారితో చెప్పండి. అప్పుడు నేను ఆ డబ్బుతీసుకుని అడివికిపోయి అరడజను పోస్లార్ దూలాలు కొనుక్కుంటాను. వాటితో నా ఇంటికప్పు పూర్తి అవుతుంది.

బాలుడు: అయితే నీకు స్వంతఅడివి ఏమీ లేదూ?

వడ్రంగి: మీరు వరుసగా మూడురోజులపాటు రాత్రింబగళ్ళు నడిచినా అంతుదొరకని అడవులు మాకు వున్నాయి. కాని వున్నచిక్కల్లా ఏమిటంటే, ఆ అడవులు మా స్వంతానివి కావు!

బాలుడు: మరి మా అమ్మగారికి పెద్దఅడివి వుంది. ఆ అడివి కెళ్ళాలంటే ఆమెకు చెడ్డచిరాకట. ఎందుకంటే అది అంతులేని అడివి. ఆ అడివి మూలంగానే ఆమెగారికి అనేక కష్టాలు వస్తున్నాయని చెపుతోంది.

వడ్రంగి: అవును బాబూగారూ! అదే విచిత్రమైన విషయం! మీ అమ్మగారికి తనఅడివి చాల పెద్దది కావడంచేత కష్టాలు కలుగుతున్నై. నాకేమో అసలే అడివి లేనందు

వల్ల చెడ్డ చిక్కుగావుంది. సరే; నేను మీతో ముచ్చట్లాడుతూ చేయాల్సిన పనిసంగతి మరచిపోతున్నాను. ఇహ నాపని పూర్తిచేసుకుంటాను.

[మళ్ళీ పనిచేయడం ప్రారంభిస్తాడు.]

బాలుడు: నేను పెద్దవాణ్ణి అయింతరువాత ప్రతివాడికీ తక్కినవాళ్ళతో సమానంగా వుండేలా చేస్తాను. అందరికీ సమానంగా ఆస్థివుండే ఏర్పాటు చేస్తాను. అప్పుడు ఎవరికీ ఏ కష్టమూ వుండదు.

వడ్రంగి: మీరు కాస్త తొందరగా పెద్దవారుకాండి బాబుగారూ! లేకపోతే నేను చాలాకాలం వేచివుండాల్సి వస్తుంది! కాని మీరు ఇప్పుడు చెప్పినమాటమాత్రం మరిచిపోకూడదు!... ఏదీ? నా రంపం ఎక్కడ పెట్టాను?

# సంతానం

[ఒక శ్రీమంతురాలు తనబిడ్డలను—హైస్కూలులో చదివే 14 ఏండ్ల పిల్లవానిని, టానిచ్ కా అనే 5 ఏండ్ల అమ్మాయిని వెంటబెట్టుకుని తోటలో షికారుచేస్తూవుంటుంది. రైతుకుటుంబానికిచెందిన ఒక వృద్ధురాలు అక్కడికి వస్తుంది.]

శ్రీమంతురాలు: ఏమిటి మాట్రినా!

వృద్ధురాలు: మీకోసమే వచ్చాను అమ్మగారూ...

శ్రీమంతురాలు: సరే, ఏంకావాలో చెప్పు.

వృద్ధురాలు: ఏంచెప్పను అమ్మగారూ! మీతో చెప్పడానికి సిగ్గుగావుంది. కాని ఏంచేయను? తప్పదు. నా కూతురు మళ్ళీ ప్రసవించింది. ఆ బిడ్డకు జ్ఞానస్నానం చేయించడానికి మళ్లీ మీరు వస్తారేమో అడిగిరమ్మని పంపించింది.

శ్రీమంతురాలు: నిజం చెప్పు. మళ్ళీ ఇంత తొందరలోనే బిడ్డపుట్టిందా?

వృద్ధురాలు: నిజమే చెబుతున్నా అమ్మగారూ! ఏటేటా కానుపువస్తోంది.

శ్రీమంతురాలు: నీ కిప్పటికి ఎంతమంది మనుమలు, మనమరాండ్రు ఉన్నారు?

వృద్ధురాలు: ఏంచెప్పను? లెక్కలేదు. సగంమంది పిల్లలను ఎవరికైనా ఇచ్చేస్తే బాగుండుననిపిస్తోంది. అందరూ పసికూనలు. ఒకరికంటె ఒకరు చిన్నవాళ్ళు. ఏంచేయను తల్లీ? దురదృష్టం!

శ్రీమంతురాలు: నీ కూతురికి ఇది ఎన్నో కాన్పు?

వృద్ధురాలు: తొమ్మిదో కాన్పు. పుట్టినవాళ్ళంతా బ్రతికే వున్నారు. ఆ దేవుడు కొందరిని ఎత్తుకుపోయినా బాగుండేది.

శ్రీమంతురాలు: అదేమిటి మైత్రినా? ఆ మాట అనడానికి నీకు నోరెలావచ్చింది!

వృద్ధురాలు: మరి ఏం చేయమంటారు? దరిద్రుడికి పిల్లలు ఎక్కువ అన్నట్లు, తిండిలేక మాడి చచ్చేవాళ్ళకు ఆ దేవుడు ఇంతమంది పిల్లలను ఎందుకివ్వాలి? పాపం తల్లీ! పాపం! చేసుకున్న పూజ అలాంటిది. సరే. మీరెలాగైనా ఆ బిడ్డకు జ్ఞానస్నానంచేయించడానికి అంగీకరించాలి. మాదగ్గర డబ్బులేదు. మతగురువుకు ఇవ్వడానికి కూడా చేతిలో చిల్లిగవ్వలేదు. కడుపునిండా తినడానికి రొట్టెకూడా లేదు. బిడ్డలంతా పసివాళ్ళు. నా అల్లుడేమో రెక్కలకష్టం చేసుకోవడానికి పట్నం పోయాడు. ఆడవాళ్ళం మేము ఇల్లుకనిపెట్టుకుని పడున్నాం తల్లీ! నాకేమో వృద్ధాప్యం వచ్చింది. అదేమో, ఎప్పుడూ చంటిపిల్లలతో సతమతమవుతూవుంటుంది. అలాంటి ఆమె ఏం పనిచేయగలదు? అన్నిపనులూ నేనే చేసుకోవాలి—నా చుట్టూ గుంపెడు పిల్లలు 'తిండి తిండి' అని అలమటిస్తున్నారు...

శ్రీమంతురాలు: నిజంగా తొమ్మిదిమంది సంతానమా?

వృద్ధురాలు: అవును తల్లీ! నా మాట అబద్ధమేమో వచ్చి చూడండి. పెద్దవాడు ఇప్పుడిప్పుడే కొంచెం చేతికి

నాయంచేస్తున్నాను. శక్కినా బిడ్డలంతా మరీ చంటి పిల్లలు.

శ్రీమంతురాలు: ఆమె కింతమంది సంతానం కలగడానికి కారణం?

వృద్ధురాలు: ఏముంటుంది తల్లీ? అల్లుడేమో పట్నంలో వుంటున్నాడు. నెలపునాడల్లా ఇంటికి వచ్చిపోతుంటాడు. వాళ్ళిద్దరూ వయసువాళ్ళాయె. ఏం చెప్పను తల్లీ!...

శ్రీమంతురాలు: అవును, అర్థమైంది. కొందరు సంతానం లేదని దుఃఖిస్తుంటారు మరికొందరు బిడ్డలు పోతున్నారని ఏడుస్తుంటారు. మీరేమో సంతానం ఎక్కువైందని దుఃఖిస్తున్నారు. ఎంత చిత్రం!

వృద్ధురాలు: అవును తల్లీ! శక్తికిమించిన సంతానం అయింది. ఏంచేస్తాం? మీ రెలాగో కనికరించి ఆ బిడ్డకు జ్ఞాన స్నానం చేయించాలి. మీకంటె మాకు దిక్కు లేదు తల్లీ!

శ్రీమంతురాలు: సరే. అలాగే వస్తాను. ఇదివరకుపిల్లలకు కూడా నేనే చేయించాను. ఈ బిడ్డకూ నేనే వుంటాను. ఇప్పుడు పుట్టింది అబ్బాయా, అమ్మాయా?

వృద్ధురాలు: అబ్బాయే తల్లీ! చిన్నబిడ్డ. వళ్లు చేయలేదు. కాని దృఢంగావున్నాడు... ...అబ్బ! ఒకటే ఏడుపు... ఏడవడం మొదలెడితే గుక్కపట్టి ఏడుస్తాడు... మీకు ఎప్పుడు తీరికవుంటుందో చెప్పండమ్మా!

శ్రీమంతురాలు: మీఇష్టం. నీకు ఎప్పుడు అనుకూలంగా వుంటే అప్పుడు కబురుచెయ్యి వస్తాను. [వృద్ధురాలు ఆమెకు తన కృతజ్ఞత తెల్పి వెళ్ళిపోతుంది.]

టానిచ్ కా: అమ్మా! కొందరికి బిడ్డలుంటారు; కొందరికి వుండరు. ఎందుచేత? నీకూ, మెట్రినాకు వున్నారు. మరి పరాషాకు బిడ్డలు లేరేం?

శ్రీమంతురాలు: పరాషాకు ఇంకా పెళ్ళికాలేదమ్మా. పెళ్ళి అయినవారికే బిడ్డలు పుడతారు. పెళ్ళిచేసుకుని భార్యాభర్తలు అయింతరువాత సంతానం కలుగుతుంది.

టానిచ్ కా: అయితే అలా పెళ్ళిచేసుకున్నవాళ్ళందరికీ బిడ్డలు పుడతారా?

శ్రీమంతురాలు: లేదు. అందరికీ పుట్టరు మన వంటవాడికి భార్య వుంది. నీకు తెలుసుగా! కాని వాళ్ళకు బిడ్డలులేరు.

టానిచ్ కా: అయితే అమ్మా! కావాలనుకున్నవాళ్ళకు బిడ్డలు పుట్టేటట్లు, అక్కర్లేదనుకున్నవాళ్ళకు పుట్టకుండా వుండేటట్లు, ఏర్పాటు చేసుకోకూడదూ?

బాలుడు: నీమొహం! బుద్ధిలేని ప్రశ్నలు వేస్తుంటావు!

టానిచ్ కా: బుద్ధిలేని ప్రశ్నలు కానేకావు! మెట్రినాకూతురుకు బిడ్డలు అక్కర్లేదు. అలాంటప్పుడు ఆమెకు బిడ్డలు లేకుండా ఏర్పాటుచేయడంమంచిదికదా. ఏమే అమ్మా! అలా చేయకూడదూ?

బాలుడు: నీవు మాట్లాడేదానికి అర్థంలేదు. ఆ విషయాన్ని గురించి నీకు తెలీదు.

టానిచ్ కా: ఏం అమ్మా! అలా చేయకూడదూ?

శ్రీమంతురాలు: నేను నీకు ఎలాచెప్పను? ఆవిషయం మనకు తెలీదు... అదంతా దేవుడిదయ!

టానిచ్‌కా: అది సరే. అసలు ఏ కారణంవల్ల బిడ్డలు పుడతారు?

బాలుడు: [నవ్వుతాడు] నీ వొక మేకవు!

టానిచ్‌కా: [రోషం తెచ్చుకుని] ఇందులో నవ్వాల్సిన పనేమీలేదు. నా ఉద్దేశ్యం ఏమిటంటే, మైత్రినా చెప్పినట్లు బిడ్డలు పుట్టడంవల్ల మనుషులకు కష్టాలు వచ్చేటట్లయితే—పుట్టకుండా ఆపుచేయాలి. మన పనిమనిషికి బిడ్డలులేరు—అలాగే!

శ్రీమంతురాలు: ఆమెకు పెళ్ళికాలేదు. ఆమెకు భర్త లేడు. అంచేత బిడ్డలుకూడా లేరు.

టానిచ్‌కా: అవును. అంచేతనే పిల్లలు అవసరంలేదనుకొనే వాళ్లు అలావుండవచ్చుకదా. లేకపోతే ఏం జరుగుతుందో చూడు. పిల్లలుపుట్టడం, వాళ్ళను పోషించడానికి శక్తి లేకపోవడం. [శ్రీమంతురాలు కొడుకువైపు, మరొకసారి కూతురువైపు క్రిగంటచూచి మౌనం వహిస్తుంది.] నేను పెద్దదాన్ని అయింతరువాత తప్పకుండా పెళ్ళిచేసుకుని, ఒక [illegible]

[illegible]

శ్రీమంతురాలు: [తన కొడుకుతో] అవును. పసివాళ్ళ పలుకుల్లో సత్యం వుంటుందని చెపుతారు. అమ్మాయి చెప్పింది యదార్థం. జీవితంలో వివాహమనేది అతి ప్రధానమైన విషయమనీ, అదొక సరదా కాదనీ, ప్రజలు అర్థంచేసుకున్నట్లయితే—వాళ్లు తమ స్వార్థంకోసం కాకుండా తమ బిడ్డల శ్రేయస్సుకోసమే వివాహం చేసుకుంటారు. అప్పుడు బిడ్డలను వదిలిపెట్టడం, లేక అశ్రద్ధచేయడం మొదలైన నీచమైన తలంపులు మనకు కలుగవు. మెటిల్డా కూతురుకుమల్లే సంతానంవల్ల సంతోషంలేక, విచారం కలిగే అవకాశమూ వుండదు.

# చదువు

ఒకపనివాడు.

నికోలే, హైస్కూలు విద్యార్థి, వయస్సు 15.

కొట్యా, వయస్సు 7.

వారితల్లి.

[పనివాడు తలుపు బొద్దెలకు రంగు పూస్తుంటాడు. కొట్యా చిన్న ఇటుకలతో ఒక బొమ్మరిల్లు కడుతూవుంటుంది. నికోలే, బడినుంచివచ్చి చేతిలోని పుస్తకాలు అవతల పడేస్తాడు.]

నికోలే: వాళ్ళూ వాళ్ళహైస్కూలూ పాడుగాను!

పనివాడు: ఏమిటిసంగతి?

నికోలే: ఏముంది? నాకు మళ్ళీ ఒకమార్కు వేశారు. వాళ్ళు పాడుగాను! అన్నిటికంటె ఆ భూగోళం నాకు వచ్చిచావడంలేదు. దానిపాడుగాను! ఏవో ముష్టిప్రశ్నలు అడుగుతారు. క్లిఫోర్నియా [కాలిఫోర్నియా] లేకపోతే అలాంటిది మరొకటో ఎక్కడుందని వాళ్ళప్రశ్న! ఆ పాడు దేశం ఎక్కడుందో నా కెలా తెలుస్తుంది?

పనివాడు: అయితే వాళ్ళు ఇప్పుడు ని న్నేంచేస్తారు?

నికోలే: ఏంచేస్తారు! మళ్ళీ నన్ను అదేతరగతిలో పడేసి వుంచుతారు.

పనివాడు: మరి అయితే, నీవు నీ పాఠాలు ఎందుకు నేర్చుకోలేదూ?

నికోలే: ఎందుకంటే—నే నిలాంటి చెత్తఅంతా నేర్చుకోలేను. ఓ! వాళ్ళంతా సముద్రంలోపడి చావనీ! [వెళ్ళి

ఒక కుర్చీలో గభాలున కూలబడతాడు.] వెళ్ళి, ఈ చదువు నావల్లకాదని అమ్మతో చెప్పేస్తాను. దాంతో తీరిపోతుంది. పాడుపీడ. ఎవరు ఏమైనాచేయనీ ఈచదువు మాత్రం నావల్లకాదు. ఆమెకూడా నన్ను బడి మాన్పించకపోతే, నేనే బళ్ళోంచి పారిపోతాను!

పనివాడు: ఎక్కడికి పారిపోతావు?

నికోలే: ఎక్కడికేమిటి? ఇల్లువదిలి పారిపోతాను. ఎక్కడికో పోయి, బండితోలడమో, లేక కూలిపనో చేసుకుంటూ బతుకుతాను. ఈపాడుచదువుకంటేఏపనిఅయినామంచిదే.

పనివాడు: కూలిపని సులభం అనుకున్నావా నాయనా! ప్రొద్దుపొడుపున లేచి రాత్రివరకూ ఎముకలు విరుచుకోవాలి, ఏమనుకున్నావో! కట్టెలు కొట్టడం, అడివికి పోవడం, బరువులుమోయడం—— ఓ! ఒకటేమిటి? ...

నికోలే: ఉష్ [ఈలవేస్తాడు] ఇంతేకదా! ఇలాంటి పనులన్నీ సెలవురోజుల్లో ఎగిరినట్లు ఎగురుకుంటూ చేస్తాను. కట్టెలు కొడుతోంటే చాల సరదాగా వుంటుంది. నన్ను భయపెట్టాలని చూస్తున్నావేమోకాని, నేనేం జంకేవాణ్ణి కాదు. ఈ పనులన్నీ నాకేం కష్టంలేదు. ఆ భూగోళం వుంది చూచావూ? అదొక్కటే కష్టమైనపని! దాన్ని నీవు నేర్చుకోవడానికి ప్రయత్నించూ, ఎలాంటిదో నీకే తెలుస్తుంది!

పనివాడు: నిజంగానా? అయితే అదనేర్చుకోమని నీకెందుకు చెపుతున్నట్లు?

నికోలే: ఆ సంగతి నన్ను అడుగుతావేమిటి? అది వాళ్ళకే

తెలియాలి. అదొకరూల్సు. భూగోళం నేర్చుకోనిదే మనం జీవించలేమని వాళ్ళ అభిప్రాయం!

పనివాడు: అలాగైతే నీవూ నేర్చుకోవాలి. లేకపోతే పెద్ద పెద్ద ఉద్యోగాలు ఎలా వస్తాయి? మీనాన్న, మీ బాబాయి చూడు. అవి నేర్చుకునేగా, బాగా జీతంసంపాయిస్తున్నారు!

నికోలే: ఏమో! అది నాకు ఇష్టంలేదు.

కాట్యా: అవును. అదినేర్చుకోవడం నీకిష్టంలేదు. [తల్లి, ఒక ఉత్తరంపట్టుకుని ప్రవేశిస్తుంది.]

తల్లి: నీకు మళ్ళీ ఒకమార్కు వచ్చిందని హెడ్‌మాష్టరు వ్రాశాడు! ఇలాచేస్తే కుదరదు నికోలెంకా! నాకో విషయం చెప్పు. అసలు నీకు చదువుకునే ఉద్దేశ్యం ఉందా లేదా?

నికోలే: అవునమ్మా! ఈ చదువు నావల్లకాదు. నన్ను దయ దలచి ఈ బడి మాన్పించవే! నేను నేర్చుకోలేను.

తల్లి: ఎందుకు నేర్చుకోలేవు?

నికోలే: ఎందుకేమిటి? ఊరికేనే నేర్చుకోలేను. వాళ్లుచెప్పేది ఏమాత్రం నా బుర్రకెక్కడంలేదు.

తల్లి: ఎందు కెక్కడంలేదు? నీవు చదువుమీద ధ్యాసపెంచడంలేదు. అంచాత అది నీ బుర్రకెక్కడంలేదు. ఇహ ఇలాంటి పిచ్చివాగుడు వాగక, పాఠాలు గట్టిగా చదువు.

నికోలే: నాకు చాలా కష్టంగా వుందమ్మా! ఎలాగైనా సరే, ఈబడి మాన్పించు. నేను చదవలేను. నా కర్థంకాదు. ఈ భయంకరమైన యాతన నేను పడలేను. ఒక్క అక్షరం

కూడా నా మనసుకు పట్టడంలేదు. ఈ పని నావల్ల కాదమ్మా!

తల్లి: అయితే, ఏంచేస్తావురా?

నికోలే: ఏంచేస్తానో, అది నా స్వవిషయం.

తల్లి: కాదు. అది నీ స్వవిషయం ఎలాఅవుతుంది? అది నాకు సంబంధించిన విషయం. నీకు విద్య చెప్పించాల్సినబాధ్యత నాది. నిన్ను గురించి దేవుడికి సమాధానం చెప్పవలసిన దాన్ని నేను.

నికోలే: నాకు చదువు రాదనుకో! అప్పుడూ?

తల్లి: [తీవ్రంగా] ఏమిటావాగుడు! తల్లిగా చివరిసారి చెప్తున్నాను. పిచ్చి పిచ్చి ఆలోచనలు మానుకుని బుద్ధిమంతుడవై చదువుకో. నీవు నామాట వినకపోయావా, తరువాత గట్టిగా చర్యతీసుకోవాల్సివస్తుంది.

నికోలే: నీకు చెప్పానుకదమ్మా! నేను చదువుకోలేను. నాకు చదువుకోవాలని లేదు.

తల్లి: నికోలే! జాగ్రత్తగా మాట్లాడు.

నికోలే: జాగ్రత్తతో పనిలేదు! నన్ను నీవు అనవసరంగా ఎందుకు బాధిస్తావు? నా కేం అర్థంకాదు.

తల్లి: నోర్ముయ్! ఇలాంటి మాటలు మాట్లాడడానికి నీకు ఎన్నిగుండెలు వచ్చాయిరా? అమ్మ పిల్లగాడూ! ముందీ గదిలోంచి వెళ్లు! ఊ! కదలవేం?

నికోలే: సరే వెడతాను. నేను దేనికీ భయపడడంలేదు. నీ నుంచి నాకు కావల్సిందికూడా ఏమీలేదు.

[తలుపు దఢీమని వేసి బయటికి పరుగెత్తుతాడు.]

తల్లి: [తనలో] వీడు నాప్రాణాలు తీస్తున్నాడు. వీడి కిలాంటి దుబ్బుద్ధి ఎందుకు పుట్టిందో తెలీడంలేదు. చదువుమీద మనసువుంచకుండా వున్నాడు వెధవ. అంచాతనే ఇన్ని తిప్పలువచ్చాయి. కుక్కలు, కోళ్ళనుగురించి ఆలోచించడంతప్ప, వీడు చదువునుగురించి ఆలోచించడు. హు!

కాట్యా: అమ్మా, అమ్మా! దేనిమీదనైనా ఒకదానిమీద మనసునిలిపి వుంచడం కష్టమని ఇదివరకు నీవే చెప్పావు కదమ్మా!

తల్లి: [కోపంగా] నీ మొహం! నే నావిషయం కాదు మాట్లాడేది. వాడు, బళ్ళో చెప్పిన పాఠాలు చదువుకోవాలంటు న్నాను.

కాట్యా: మరి అన్నయ్య చదువుకోలేను అంటున్నాడుగా?

తల్లి: నాడు అలాగే పిచ్చివాగుడు వాగుతాడు.

కాట్యా: అదికాదమ్మా! అన్నయ్య ఏపనీ చెయ్యనని చెప్ప ...లేదుగా? భూగోళం చదువుకోవడం మాత్రమే ఇష్టం ...టున్నాడు. కాని మరోపని ఏదైనా చేస్తానంటు ... బండితోలడమో, కూలిపనికి పోవడమో, బరు మోయడమో చేస్తానంటున్నాడు.

... ఒకకూలివాడికొడుకు అయినట్లయితే కూలి ...చ్చు. వాడు మీ నాన్నగారికొడుకు. మీ ...తే వాడూ చదువుకోవాలి. తెలిసిందా?

... చదువుకోవడం ఇష్టంలేదంటున్నాడు!

...హాయ్యేది, చదువుకొనితీరాలి.

కాట్యా: మరి అతను చదువుకోలేడేమో! దానికేంచేస్తాం?
తల్లి: నోరుమ్మయ్! నీవూ వాడిలాగానే వాదిస్తున్నావా? వాడిలాగా తయారవుదామనా?
కాట్యా: అవును. నేనూ అన్నయ్యలాగానే చేస్తాను. నాకు ఇష్టంలేని చదువు ఏమాత్రం చదవను.
తల్లి: అప్పుడు నిన్ను అంతా బుద్ధిలేని మొద్దువని అంటారు.
[మౌనం వహిస్తుంది.]
కాట్యా: నేను పెద్దదాన్ని అయి, నాకు బిడ్డలు పుడితే, వాళ్లను చదువుకోమని నే నెప్పుడూ బలవంతంచెయ్యను. వాళ్లు చదువుకోవాలనుకుంటే చదవనిస్తాను, లేదంటే వాళ్ళను నేను బలవంతపెట్టను.
తల్లి: నీవు పెద్దదానివి అయితే, అలా చేయనేచేయవు.
కాట్యా: తప్పకుండా చేస్తాను.
తల్లి: చేయలేవు. ఎన్నటికి చేయలేవు.
కాట్యా: చేస్తాను, చేస్తాను, చేస్తాను!
తల్లి: అయితే నీకు బుద్ధిలేదంటారు.
కాట్యా: బుద్ధిలేనివాళ్ళనే దేవుడు కనికరిస్తాడని ప[illegible] చెప్పిందమ్మా!



---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B125 |
| పుస్తకం పేరు | పిల్లల తెలివితేటలు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 75 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | [illegible] |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | narma |
| పేజీలు విడదీసినది | narma |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |